# ధనిష్ఠ

**"ధనిష్ఠ"** అనగా ధనపూరిత దివ్యవాయువు. ధనమనగ దివ్యసంపద. అది కేవలము డబ్బుకాదు. డబ్బుతో సంపదను కొలువలేము, కొనలేము. సంపద జీవన వైభవమునకు సంబంధించినది. మన శ్రుతులలో అగ్ని, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి యిత్యాది దివ్య ప్రజ్ఞలను ధనమనిరి. ఆర్షవిజ్ఞానమే నిజమైన ధనము. అట్టి ధనమును కూర్పుచేసి వ్యాప్తి చేయుటకు 'ధనిష్ఠ' 1992లో జనించినది.

**"ధనిష్ఠ"** డా॥ కంభంపాటి పార్వతీకుమార్ గారి వాక్కును సి.డి., ఆడియో, వీడియో క్యాసెట్ల రూపములోను, పుస్తకముల రూపములోను భద్రపరచి సత్సాధకుల కందించునట్టి యజ్ఞార్థ కర్మను చేపట్టినది.

**"ధనిష్ఠ"** ఒక చక్కని గ్రంథాలయమును, ధ్యానమందిర మును, సద్గోష్ఠికై వలసిన ప్రశాంత వాతావరణమును - "జగద్గురు మందిరము"గ ఏర్పరచి, ఆసక్తి కలవారికి ధ్యానము, స్వాధ్యాయము నేర్పుచున్నది.

# సంకలనకర్త : మాస్టర్ కంభంపాటి పార్వతీకుమార్

**మా**తృదేశము మొదలుగా ఉత్తర అమెరికా, లాటిన్ అమెరికా మరియు ఐరోపా ఖండములలోగల ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ప్రచోదనము కలిగించుచూ, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగా భ్యాసము యిత్యాది విషయములలో బోధనలు గావించుచూ, పరమగురువుల మార్గానుయాయులకు వెలుగుదారి చూపించు చున్న సత్సాధనా సంపత్తిగల నవయుగ యోగ మార్గదర్శి **మాస్టర్ కంభంపాటి పార్వతీకుమార్** గారు. వారి బోధనలు లెక్కకు మించి యున్ననూ, పలురకములైన విషయ, విజ్ఞాన బోధనలుగా తెలియ వచ్చును. అవి బోధనలుగానే కాకుండా నిత్యజీవితమున అనుసర ణీయమై, ఆచరణయోగ్యమై, ఆచరించువారికి సత్యదర్శనమున సత్వర ఫలితముల నందించుచున్నవని తెలుపుట అతిశయోక్తి కానేరదు.

సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, కళా రంగములలో వారి నిరంతర సేవలను గుర్తించి, గౌరవించి, ఆంధ్ర విశ్వకళా

పరిషత్ **"డాక్టర్ ఆఫ్ లెటర్స్"** పట్టానందించి, ఆదర్శవంతమైన వారి సేవలను కొనియాడినది.

ఆర్థిక, సాంఘిక, సేవారంగములలో – మానవాళి మనుగడలో సుఖము, శాంతి పరిమళింపజేయు సూత్రముగా ఆధ్యాత్మికత అలరారినప్పుడే, దానికి సాఫల్యత, సార్థకత ఉండునని, "మానవ సేవయే మాధవసేవ" అను మాటకు సరియైన అర్థము యిదేనని శ్రీ కుమార్‌గారు తమ ప్రవర్తన ద్వారా తెలియపరచుచున్నారు. శ్రీ పార్వతీకుమార్ బాధ్యతగల గృహస్థులు, పేరున్న ఆర్థిక సలహా దారు, విజ్ఞానమును వికసింపజేయు గురువు, శారీరక – మానసిక రుగ్మతలను తొలగింపజేయు వైద్యులు, అనేక గ్రంథముల సంకలనకర్త, నిగర్వి, నిర్మల హృదయులు.

జ్ఞానము ఏ ఒక్కరికి చెందినది కాదనియు, జ్ఞానులు సైతము అందరునూ జ్ఞానమునకే చెందిన వారనియూ, జ్ఞానమే సరియగు వాహికల నెన్నుకొని తనను తాను ప్రకటించుకొనుచుండు ననియూ, అందుచే నిజముగా ఎవ్వరూ గ్రంథకర్తలు కాజాల రనియూ, సంకలన కర్తలే ననియు శ్రీ కుమార్‌గారి దృఢ

విశ్వాసము. విశేష పరిజ్ఞానముగల ప్రతిభావంతు లైనప్పటికి సౌశీల్యముతో సామాన్యుల మిత్రత్వము నభిలషించు సమవర్తి.

శ్రీ పార్వతీకుమార్‌గారి ఆధ్వర్యమున ఎన్నియో ధార్మిక సంస్థలు దేశవిదేశములలో పరహితసేవ గావించుచున్నవి. “పరహితము పరమధర్మ” మను ఆర్యోక్తి వారి జీవితమును నడిపించుచున్నది. భగవధ్యానము, స్వాధ్యాయము, పరహితము లకు త్రిధాబద్ధులుగా ఎందరో ఆస్తికులకు వారు ప్రపంచమున ప్రచోదనము గావించుచున్నారు. పరమగురు పరంపర వారి కాదర్శము.

**- ధనిష్ఠా ఫౌండేషన్**

# ముందుమాట

శ్రీ కృష్ణాష్టోత్తర శత నామములకు అర్థము తెలిపి వివరింపుడని చిరంజీవి మురళీధర్ విద్యార్థిగ కోరినాడు. కృష్ణ నామములకు వివరణము ఎంత వివరించినను చాలదు. భక్తితో నామ స్మరణము చేయువారికి ఈ నామముల నుండి అనేకానేక రహస్యార్థములు గోచ రించును. అర్థము తెలుసుకొనుట కొంత అర్థవంతము. నామము నందు రుచి కలిగి స్మరించుచు మధుర భక్తి యందు తన్మయమగుట ఈ నామములకు నిజమగు ఫలశ్రుతి.

మానవుడు మనసు ప్రధానముగ జీవించును గనుక కొంత అర్థము తెలిసినచో మనస్సు సమాధాన పడగలదు. మనసు సమ ఆధానము చెందినపుడు హృదయమున చేర్చి స్తోత్రమును చేయుట సముచితము. శ్రద్ధాళువులట్లు నిర్వర్తించుకొందురు గాక.

చిరంజీవి మురళీధర్ రూపమున మురళీధరుడే ఆదేశించినాడని భావించి వివరణము ప్రారంభించితిని. చిరంజీవి ఆదుర్తి కృష్ణ తన వివాహ శుభముహూర్త కాల నిర్ణయ సమయమున, నాచే రచింపబడుచున్న ఏ సద్విష యమునైనను కల్యాణము సమయమునకు ప్రచురింప కోరెను. వ్రాయమనినవాడు మురళీధరుడు, వ్రాసినది శ్రీమతి కృష్ణకుమారి, వెంటపడి వ్రాయించిన దామెయే. ప్రచురణ భారము వహించినవాడు చిరంజీవి శ్రీకృష్ణ. అంతయు కృష్ణమయముగ ఈ చిన్న సంకల్ప మవత రించినది. అందరికిని జగద్గురువు శ్రీకృష్ణుని ఆశీర్వచనము దండిగ పండవలెనని గోవిందుని ప్రార్థిస్తూ ....

తేది : 24-6-2006

స్థలము : నీలాకాశము — కంభంపాటి పార్వతీకుమార్

# అసుర సంహారము

**కృ**ష్ణాష్టోత్తరమున అసుర సంహారము చాల గోచ రించును. ప్రతి మానవుని యందును దేవతాశక్తులు, అసురశక్తులు వుండును. అసురశక్తులు జీవుని దేహమును బంధించుచు నుండును. జీవ పురోగతికి అడ్డు వచ్చుచు నుండును. అవి దమింపబడినపుడే కాని, జీవుని పురోగతి సుగమమై సాగదు. కృష్ణాష్టోత్తరము పఠించుట వలన ఈ అసురశక్తులు మనయందు కృష్ణుని మహిమచే నశింప గలవు. అష్టోత్తరమున పేర్కొనబడిన అసురశక్తులను, అవి మనయందెట్లు వర్తించునో క్లుప్తముగ ఈ దిగువ వివరింప బడుచున్నవి.

**1. పూతన :** పూతన స్తనములు రాగద్వేషములకు సంకేతము. ఆమె అందించు పాలు విషయ భ్రాంతి.

**2. శకటాసురుడు :** పాపియగువాడు పుణ్యకార్యములు చేసినను, పాపకారణమున పతనము చెందును. శకటా సురుడు కృష్ణుని తన్నుచే పైకెగిరినను, క్రిందపడి మరణించెను. పుణ్యము తాత్కాలికముగ స్వర్గమును చేర్చినను, పాపము పతనము కావించును. పుణ్య కార్యములు చేయువారు పాపభీతికూడ కలిగి యుండ వలెను. శకటాసురుడు పుణ్యము చేయువారిని పాపము నకు ప్రోత్సహించు అసురశక్తి.

**3. వత్సాసురుడు :** వత్సాసురుడు ఇంద్రియలోలత్వము కలిగించు అసురుడు. రుచి, స్పర్శ, చూపు, వినికిడి, వాసన లకు జీవులు లోబడునట్లు చేయు అసురశక్తి.

**4. బకాసురుడు :** కుటిలమగు పలుకులు పలుకుచు తానేమి చేసినను చెల్లిపోవునను అహంకార రూపము బకాసురుడు.

**5. అఘాసురుడు :** ఇతరుల ఆనందమును సహించలేక ఈర్ష్యతో దుఃఖము కలిగించు ప్రయత్నము చేసెడి

అహంకారము. తన ఈర్ష్య ఇతరులకు దుఃఖ కారణమగు అసురశక్తి.

**6. ధేనుకాసురుడు :** కామ క్రోధ లోభ మోహ మనెడి నాలుగు కాళ్ళతో కూడిన గాడిదవంటి మొగదూడ ధేనుకా సురుడు. ఈ నాలుగు అసుర శక్తులు ఒకదానితో నొకటి కలసి నడుచుచు నుండును. ఆ నాలుగు కాళ్ళను పట్టి సంహరించినవాడు బలభద్రుడు.

**7. కాళీయుడు :** ఆత్మ సాధకులయందు జ్ఞానము జనించుటకు ముందు అవరోధమై నిలిచెడి హాలాహలము వంటి విషము. పింగళనాడి అను యమునానది యందుండి సుషుమ్నను చేరుటకు అడ్డుపడుచు నుండును. అమృతత్త్వము నందగోరు సాధకులకు మరణమై అడ్డు నిలుచు అసురశక్తి.

**8. శంఖచూడుడు :** కుత్సితముగ ధనమార్జించు బుద్ధి. ఇతరుల ధనము తెలివిగ అపహరించు బుద్ధి.

**9.** వృషభాసురుడు : సత్సాధకులను తికమక పెట్టుచు, శుష్క వేదాంతము పలుకుచు, తప్పుద్రోవ పట్టించెడి అసుర శక్తి వృషభాసురుడు.

**10.** వ్యోమాసురుడు : నీచ సాంగత్యము చేయు అసురశక్తి.

**11.** కువలయా పీడనము (కంసుని ఏనుగు) : పతనము గావించు మనస్సు. మనస్సును చేరి జీవుని పతనము గావించు అసురశక్తి.

**12.** చాణూర ముష్టికులు : తెలిసీ తెలియని మూర్ఖత, మొండివాదము అను అసుర శక్తులు.

**13.** కంసుడు : దురహంకారము అను అసురశక్తి. దైవమునుకూడ లెక్కచెయ్యని బుద్ధి. భౌతికమును మించినది లేదని భ్రమించు అసురశక్తి.

**14.** నరకాసురుడు : హృదయాకాశమును చేరకుండు నట్లు అడ్డుపడి, సంసార సముద్రమున జీవులను పడవేయు

అసురశక్తి. పంచభూతముల నావరించియుండు అవిద్యా పంచకము.

**15. మురాసురుడు :** అవిద్యా పంచక మనగా మహా మోహము, కోపము, అంధతామిశ్రము (confusion), మరణము, చంచలత్వము.

**16. బాణాసురుడు :** తనకంటె వేరుగ దేవుడున్నాడని భిన్న జ్ఞానముగల రజోగుణ అహంకార శక్తి.

**17. దుర్యోధనాదులు :** స్వార్థమను అసురశక్తి, దాని సైన్యము.

**18. శిశుపాలుడు :** సృష్టి అంతయూ ప్రకృతి స్వరూపమే అని, దైవమను తత్త్వము లేదని, అట్టి తత్త్వము రూపు కట్టుకొని అవతరించుట కట్టుకథ అని భావించు అజ్ఞాన అహంకారము.

పై విధముగ అసురశక్తులు మానవులయందు విజృంభించు చుండును. ఆ శక్తులను మానవు లెదుర్కొని

నిలబడలేరు. అట్టి సమయమున దైవమే శరణ్యము. దైవము నాశ్రయించుటచే దైవబలము అసుర బలమును నిర్జించి మనకు తోడ్పడగలదు. ఇట్లు అసుర సంహారక స్తోత్రములను పఠించునొక ఉత్తమ సంప్రదాయము మన వాఙ్మయమున వున్నది. కృష్ణాష్టోత్తరము ఆ కోవకు చెందినది. స్తోత్రమునందు చెప్పబడిన అసురశక్తులే కాక మరికొన్ని అసురశక్తులను శ్రీకృష్ణుడు సంహరించుట జరిగినది. అందు కొన్ని అసురశక్తులు పైన ఉదహరింప బడినవి.

అసురశక్తులు తమయందు బాగా విజృంభించుచున్న సమయమున సత్సాధకులు దుర్గా సప్తశతిని పారాయణ గావించవచ్చును. కృష్ణుడన్నను, దుర్గయన్నను ఒక్కటే. దుర్గ సకల అసుర సంహారక శక్తి. అశుభములను నిర్జించి, శుభముల నొసగుటకే మన దేవతా స్తోత్రము లన్నియును భక్తిశ్రద్ధలతో పారాయణ చేయువారికి ఈ సత్యము తెలియగలదు.

# శ్రీకృష్ణ నామామృతము - వివరణము

## 1. శ్రీకృష్ణః

కృష్ణు డనగా నల్లనివాడు, అనగా కనబడనివాడు. కనబడక, అంతయు వ్యాపించి యుండువాడు. అవ్యక్తుడు, అవగాహనకు మించినవాడు. శ్రీకృష్ణు డనగ, శ్రీతో కూడిన కృష్ణుడు. శ్రీ అనగా లక్ష్మి, సరస్వతి, పార్వతి, కాళి. కృష్ణుని రూపమే శ్రీ. అనగా శ్రీ ఆధారముగ కృష్ణుడు వ్యక్తమగు చుండును. శ్రీ అతని రూపము. శ్రీ కతడు ఆధారము. కృష్ణుడు లేని శ్రీ లేదు. శ్రీ అనగ కృష్ణుని వ్యక్తరూపమే.

## 2. కమలానాథః

కమలమునకు స్వామి అని అర్థము. కమలమున కనేకార్థములు కలవు. కమల మనగా మలినము లేనిది, పవిత్రమైనది, లక్ష్మి. ఎక్కడ దైవముండునో అక్కడ పవిత్రత యుండును. పవిత్రతకు మూలము దైవమే. ఆ దైవమే శ్రీకృష్ణుడు. కమలమనగా వికసించునది అని కూడ అర్థము. సూర్యకిరణముల సాన్నిధ్యమున కొలనులో కమలములు విచ్చుకొనును. అట్లే శ్రీకృష్ణుని సాన్నిధ్యమున సృష్టికమలము విచ్చుకొనును. మానవుని యందు కూడ కమలములు కలవు. వాని వికసింపునకు కూడ దైవ సాన్నిధ్యమే మూలము. మనయందలి షట్చక్రములు కమలములై వికసించుటకు కృష్ణ సాన్నిధ్య మావశ్యకము. సృష్టికిని, జీవునకును కూడ ఆధారభూతమై వికసింపజేయు తత్త్వము కలవాడగుటచే శ్రీకృష్ణుని కమలానాథునిగ ఈ నామము కీర్తించుచున్నది.

## 3. వాసుదేవః

సృష్టి సమస్తము నందు వసించియుండు దేవుడని అర్థము. "వాసుదేవ సర్వమితి" అని భగవద్గీత తెలుపుచున్నది. బ్రహ్మ నుండి కీటకము వరకు గల సమస్త జీవరాశుల యందు వసించి యుండు దేవుడు శ్రీకృష్ణుడు. దైవము వసించి యుండని రూపమున కస్తిత్వము లేదు. సృష్టి యందలి సమస్త రూపములు దైవము నివాసములే. జీవుని యందు కూడ వసించియుండు దేవుడు వాసుదేవుడు. అతను లేని చోటు లేదు. అంతటను వ్యాపించి యుండువాడు "ఓం నమో భగవతే వాసుదేవాయ." అను ద్వాదశాక్షరీ మంత్ర రూపమున హృదయమున ఆరాధింపబడు దేవుడు శ్రీకృష్ణుడే. ద్వాదశాదిత్యులయందు వ్యాపించియుండి కూడ ద్వాదశాత్మకుడై మన హృదయములలో వసించి యుండువాడు.

వాసుదేవుడనగా వసుదేవుని కుమారుడని కూడ అర్థము.

## 4. సనాతనః

సనాతను డనగ ఎల్లప్పుడూ నున్నవాడని, సృష్టి యున్నను లేకున్నను యుండువాడని అర్థము. సమస్త సృష్టి, సృష్టి దేవతలు, జీవకోట్లు అతని నుండి యుద్భవించి మరల అతనినే జేరును. అతను ఎల్లప్పుడునూ నుండువాడు. జీవుల లోపల, బైట కూడ నుండువాడు. అందుచేత సనాతనుడు. కాలము కన్న పూర్వము వాడని అర్థము.

## 5. వసుదేవాత్మజః

వసుదేవాత్మజుడు అనగ వసుదేవుని కుమారుడని అర్థము. వసుదేవుని ఆత్మయందు జన్మించిన వాడని అర్థము. వసుదేవునికి ఆత్మయందు దర్శన మిచ్చినవాడని అర్థము. వసుదేవుడు పరమ భక్తుడు. దైవమునకే జన్మనిచ్చు మహా భాగ్యమును పొందినవాడు. భాగవతోత్తముడు, చిరంజీవి. అతని కుమారుడైన శ్రీకృష్ణుడని ఈ నామమున కర్థము.

## 6. పుణ్యః

అనగా పవిత్రుడు అని అర్థము. అగ్ని పవిత్రము. అగ్ని స్వరూపమే శ్రీకృష్ణుడు. తేజో రూపుడు. సమస్తమును నిర్మాణము చేయగలవాడు. అపవిత్రతను దగ్ధము చేయు వాడు. అమితమగు ప్రకాశము కలవాడు. అపవిత్రతచే స్పృశింపబడని వాడు.

# 7. లీలామానుష విగ్రహః

లీలార్థమై మానవ రూపమును ధరించిన దైవము. శ్రీకృష్ణుడు రూపాతీతమగు తత్త్వము. లీలార్థమై అతడు రూపము గొనెను. రూప మతనిని పట్టలేదు. అతడే రూపమును ధరించి భక్తుల హృదయమును రంజింప జేసినాడు. నేటికిని అతని లీలామానుష రూపము భూమిపై నున్నది. ఆ రూపముననే భక్తుల కతడు సాన్నిధ్యము నందించుచున్నాడు. దర్శన స్పర్శన సంభాషణాదులు గావించుచున్నాడు. భూదేవితో కూడి, భూమిపై గల ఋషులు, సాధుజనులు ప్రార్థింపగా, తన లీలామానుష రూపమును భూమిపై నిధిగ నుంచి జీవుల ననుగ్రహించు చున్నాడు. మధుర భక్తిమార్గమున భక్తులకు యోగిజనులకు పరమానందము గావించుచున్నాడు.

## 8, 9. శ్రీవత్సః, కౌస్తుభధరః

శ్రీవత్సమును, కౌస్తుభమును ధరించినవాడు. శ్రీకృష్ణుని వక్షస్థలమునందు, శ్రీ మహావిష్ణువు వక్షస్థలమునందు పుట్టు మచ్చ ఒకటి యున్నట్లుగ ఋషులు వర్ణింతురు. నల్లని వాడగు శ్రీకృష్ణునికి గల తెల్లని పుట్టుమచ్చ శ్రీవత్సము. అది అమ్మవారి స్థానము. లక్ష్మీప్రదము. ఆమె తెల్లని తెలుపు. అతడు నల్లని నలుపు. ఆమె అతని సంకల్పముగ వెలుగై ఏర్పడగ ఆ వెలుగు నుండి సమస్త లోకములు ఏర్పడును. శ్రీకృష్ణుని వక్షమునందుగల సంకల్ప స్వరూపమే శ్రీవత్సము. దీని నారాధించువారికి దివ్యసంకల్పము అనుగ్రహింపబడును. ఈ వక్షస్థలము నావరించుకొని కౌస్తుభమణి యున్నది. కౌస్తుభమణి సర్వశుభప్రదము. క్షీరసాగర మథన సమయమున లక్ష్మీదేవితో పాటు వ్యక్త మైన ప్రశస్తమగు మణి. దీనిని దేవతలు శ్రీ మహావిష్ణువు నకు సమర్పించిరి. లక్ష్మీదేవిని శ్రీ మహావిష్ణువు వరించి

గ్రహించెను. శ్రీలక్ష్మిని, కౌస్తుభమును హృదయమున ధరించిన వాడగుటచే శ్రీ మహా విష్ణువును, శ్రీకృష్ణుని ఈ నామముతో ఋషులు కీర్తింతురు. శ్రీవత్సధరుడు ఒక నామము, కౌస్తుభధరుడు అని మరియొక నామము.

## 10. యశోద వత్సలః

యశోద కుమారుడని అర్థము. శ్రీకృష్ణుని పెంచిన తల్లి యశోద. ఆమె పరమ భాగవతోత్తమ. కృష్ణుని కన్న పుణ్యము దేవకీదేవిది కాగా, పెంచిన పుణ్యము, ఆనందము యశోదా దేవికి దక్కినది. పదకొండు సంవత్సరములపాటు పురాణ పురుషుని బాల్యక్రీడలను అనుభవించిన మాత యశోద. తల్లిదండ్రులకు పిల్లలు చిన్నతనమున అమితానందము కలిగింతురు. కృష్ణుని లీల లన్నియు కంస వధ వరకే. అటు పైన జగత్కల్యాణ కార్యము లందు అతడు నిమగ్నమైనాడు. కృష్ణ లీలల పరమానందము యశోదాదేవికి దక్కినది. అనన్యభక్తి మార్గమున శ్రీకృష్ణుని యందు శాశ్వతమై నిలచినది.

యశోద అనగా యశస్సును కలిగించునది అని కూడ అర్థము. అనగా ఆమె యశస్సునకు ప్రతిరూపము. దివ్యాత్మ

భావనయందు జీవించువారు అప్పుడప్పుడామె అనుగ్రహము నకు పాత్రులగుదురు. అట్టి వారికి శాశ్వత యశస్సు కూడ దక్కును. భక్తులందరు, యశో జీవితమును పొందినట్లు గోచరించదు. భక్తుని యందు భగవంతుని వైభవమే యశస్సు. ఈ నామము స్మరించువారిని అట్టి యశస్సు అనుగ్రహించును.

## 11. హరిః

హరి యనగా అవతరించిన దైవము. దైవ మంతటను వ్యాపించి యుండును. అతడు సర్వవ్యాపి. రూపమున కతీతుడు. అపరిమితమైన తేజస్సుగా సృష్టియందు దైవము గోచరించును. అట్టి దైవము అప్పుడప్పుడు రూపము కట్టుకొని దిగివచ్చి జగత్కల్యాణమును కావించు చుండును. దశావతారము లన్నియు అట్టివే. వెలుగునకు రూపము లేదు. కాని ఏ రూపమున నిలిపిన ఆ రూపముగ గోచరించును. మానవ రూపమున మానవునిగ గోచ రించును. అంతరంగమున భక్తులు అతనిని మానవా కారమున ఆరాధింతురు. అట్లు ఆరాధింపబడు వెలుగును యజ్ఞపురుషు డందురు. ఆరాధించినవారి వశమై అపరిమిత మగు దైవము వారియందు రూపు గట్టుకొని నిలుచును. నారదాది మహర్షులు అట్లవతరించిన సుందరమగు పురుషా కృతిని "హరి" అని సంబోధించిరి. వానితో సంభాషింతురు,

ఆనందింతురు. గోపికలు వానితోనే రసక్రీడ సాగించిరి. ఇట్టి హరియే కృష్ణరూపమున దిగివచ్చుట చేత శ్రీకృష్ణునికి హరియను నామము కలిగినది. అతడు కనబడక, అంతయు నిండిన వాడుగ శ్రీకృష్ణుడు, అంతట వెలుగుగ గోచరించు వాడుగ విఠలుడు. పాండురంగ విఠలుడు, అనగ తేజోమయ మగు రూపము మానవ రూపము. అతడు దృశ్యుడు మరియు అదృశ్యుడుగ కూడ వున్నవాడు. అతనిని "అదృశ్యో ఽ వ్యక్తరూపశ్చ" అని విష్ణు సహస్రనామ మహామంత్రము కీర్తించుచున్నది.

## 12. చతుర్భుజాత్త చక్రాసి గదా శంఖ ఆది ఆయుధః

నాలుగు చేతులయందు గద, శంఖము, చక్రము ఆదిగా గల ఆయుధములు ధరించినవాడు అని అర్థము.

హరి లేక శ్రీకృష్ణుడు చతుర్భుజుడు. సృష్టిరూపమే అతని రూపము. సృష్టి కూడ చతుర్భుజమే. అంతయు చతుర్వర్గమే అని వేదవ్యాస మహర్షి కీర్తించినాడు. పరతత్త్వమే ప్రజ్ఞ, శక్తి, పదార్థముగ నేర్పడుట చతుర్వర్గ జ్ఞానము. పరబ్రహ్మమే బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగ ఏర్పడుట కూడ చతుర్వర్గ జ్ఞానము. పరమాత్మయే జీవాత్మ బుద్ధి మనస్సులుగ ఏర్పడటము, దైవమే వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ వ్యూహములుగ నేర్పడటము, పరావాక్కుయే పశ్యంతి మధ్యమ వైఖరులుగ ఏర్పడటము, నాలుగు వేదము లేర్పడ టము, నాలుగు యుగము లేర్పడటము, దేవతలకు నాలుగు చేతులుండటము, నాలుగు వర్ణము లేర్పడటము. అన్నము నాలుగు విధములుగ పచనము చేయబడటము, బ్రహ్మకు

నాలుగు తల లుండటము భగవంతుని చతుర్భుజములకు సంకేతములు.

నాలుగు చేతులు కలవాడు పరిపూర్ణుడు. అందు ఆత్మ జ్ఞానము, బుద్ధి, మనస్సు, శరీరము అను 4 తత్త్వములు పరిపూర్ణముగ నుండును. సామాన్య మానవునకు రెండు చేతులే యుండును. అనగా మనస్సు, శరీరమే పనిచేయు చుండును. బుద్ధి, ఆత్మజ్ఞానము కూడ వికసించినచో అతడు దైవమే యగును. శ్రీకృష్ణుడు చతుర్భుజు డనుటకు సందేహమే లేదు. అవసర సమయములలో అతని దివ్య భుజములు కూడ పని చేసినవి. పనిచేయుచున్నవి కూడను.

నాలుగు చేతులయందు గల నాలుగు ఆయుధములు దివ్య సంకేతములు. అవి వరుసగ గద, శంఖము, చక్రము, పద్మము.

*గద :* శిరస్సు, వెన్నెముకల యందు వ్యాపించియుండు ఎఱుక. ఇది యోగమున సిద్ధించును.

**శంఖము :** శబ్దమునకు సంకేతము. శబ్దమే సృష్టికి

ఆధారము. అది నాదమై సృష్టిని వ్యాపించి యున్నది. అట్టి నాదము దైవము అధీనమున యున్నది.

**చక్రము :** కాలమునకు, ధర్మమునకు సంకేతము. ధర్మము ననుసరించు వారికి అది సుదర్శనము. అనగ చక్కని దర్శన మీయగలదు. కాల మనుగ్రహించినచో సమస్తము సుదర్శనమే. యోగులకీ అనుభూతి యుండును.

**పద్మము :** పద్మము వికాసమునకు సంకేతము. సృష్టి ఏడు లోకములుగ వికసించుటకు, అందు జీవు లేర్పడుటకు పద్మము సంకేతము. జీవుడు వికాసము చెంది దైవమును చేరుటకు కూడ పద్మము సంకేతము. ఈ సమస్తము దైవము అధీనమున యున్నది.

ఇట్లు భగవంతుని అధీనముననే ఎఱుక, నాదము, కాలము, సృష్టి, స్థితి, లయము లున్నవని తెలియజేయుటకు శ్రీ మహా విష్ణువును, శ్రీకృష్ణుని చతుర్భుజములలో చతురాయుధములు ధరించిన సుందరమూర్తిగ ఋషులు వర్ణించిరి.

## 13. దేవకీ నందనః

అనగా దేవకి కుమారుడు అని అర్థము. దేవకీ వసు దేవులు పూర్వజన్మలలో కూడ దంపతియే. వారిరువురును మహావిష్ణువు నారాధించి అనుగ్రహము పొందినవారు. శ్రీ మహావిష్ణువునకు తల్లితండ్రులగుటకు వరమును పొందిన వారు. వరప్రసాదముగ పురాణపురుషుడు వారికి కుమారుడుగ జన్మించెను. గర్భము ధరించిన దేవకీదేవి పదినెలల కాలములో అమందానందమును పొందినది. ఎన్నియో భగవద్విభూతులను అనుభవించినది. గర్భము నందుండియే ఆమెకు ఆనంద మందించినవాడు శ్రీకృష్ణుడు. దేవకికి ఆనందమును గలిగించినవాడు కనుక దేవకీ నందనుడు. అటుపైన యశోదావత్సలుడు. దేవకీదేవికి ఆనందమును పంచెను. యశోదాదేవికి వాత్సల్యమును పంచెను అని ఈ స్తోత్రము తెలుపుచున్నది.

# 14. శ్రీశః

అనగా శ్రీకి ఈశుడు. శ్రీపతి. శ్రీ అనగ ఇచ్ఛ, జ్ఞాన, క్రియా శక్తులకు మూలము. ఆమెనే అదితి, గాయత్రి, సావిత్రి అని వెలుగులుగ సంబోధింతురు. అట్టి వెలుగున కాధారమైన వాడు పరమాత్మ. అతని నాధారముగ గొని ఆమె సమస్తమును త్రిగుణాత్మకముగ సృష్టి చేయుచున్నది. సృష్టియం దంతయు అతనే నిండియున్నాడు. ఉండుట అతని స్వభావము కాగ అల్లిక చేయుట ఆమె స్వభావమై యున్నది. అతడు సత్యము. ఆమె చైతన్యము. అతను పెట్టుబడిగ ఆమె చేయు కార్యకలాప మంతయు ఆనందము. అదియే సచ్చిదానందము. సత్ (ఉండుట), చిత్ (చైతన్యమై ఉండుట), ఆనంద (ఆనందమై యుండుట).

## 15. నందగోప ప్రియాత్మజః

నందగోపునకు ప్రియమైన తనయుడు అని అర్థము. నందుగోపుడనగ ఆనందమును గోప్యముగ అనుభవించు వాడు. భక్తులు ఆనందమును అంతరంగమున అనుభ వించుచు నుందురు. వారు విజ్ఞానకోశమును కూడ అధిగ మించి ఆనందమయ కోశమున దివ్యపారవశ్యమున నుందురు. అట్టివా రందరును గోలోకవాసులు. వారియందు ఆనంద మెప్పుడును గోక్షీరము వలె స్రవించుచుండును. అంతరంగముననే దివ్యానుభూతులను పొందుచు బాహ్య మున సామాన్యముగ కన్పట్టువారు గోపకులు. శ్రీకృష్ణుని బాల్యజీవన మంతయు గోప గోపీజనుల ఆనందము కొరకే జరిగినది. వారి భక్తి పారవశ్యమును, ఆనందమును, దివ్య ప్రేమను గమనించిన దేవర్షి నారదుడు భక్తి యనగ వ్రజవాసులదే యని 'నారద భక్తి సూత్రము' లందు వివరించి నాడు. అట్టివారికి నాయకుడు నందగోపుడు. అతడు

నందుడే. ఆనందముననే తేలియాడుచుండు నందునకు కూడ నూతన ఆనందమును గూర్చినవాడు శ్రీకృష్ణుడు. ప్రియమును కూర్చినవాడు అగుటచే ప్రియుడు. నందుని ఆత్మ యందు ఉద్భవించిన వాడగుటచే ఆత్మజుడు. అనగ నందుని ఆత్మయం దుద్భవించి నందునికి మరింత ప్రియ మును కూర్చినవాడని అర్థము.

## 16. యమునావేగ సంహారీ బలభద్ర ప్రియానుజః

యమున వేగమును తగ్గించిన బలభద్రునికి ప్రియమైన తమ్ముడు అని అర్థము. బలరాముడు శేషాంశ. ధర్మ సంస్థాపనమునకై శ్రీకృష్ణునికి తోడుగ దిగివచ్చినవాడు. జీవుల సంక్షేమమును ప్రధాన కర్తవ్యముగ నేర్పరచుకొని బలరాముడు వేగవంతమైన యమునానది మార్గమును మళ్ళించి బీడు భూములను పంటభూములుగ మార్చినాడు. లక్షలాది జీవులకు పంటభూముల నేర్పరచినాడు. హలము (నాగలి) ఆయుధముగ ధరించినవాడు.

యోగపరముగ మనలోని పింగళనాడియే యమునానది. పింగళనాడిని సవరించి దేహమను భూమిని పంటభూమిగ మార్చు దివ్యశక్తి మన యందలి బలరాముడు. సంకర్షణు డుగ అతను మన యందున్నాడు. పురుష ప్రయత్నమే అతని శక్తి. పురుషప్రయత్నము గావించు యోగిజనులకు బల

రాముడు సహకరించును. అష్టాంగ యోగమును మానవులకు అందించినవాడు కూడ బలరాముడే. పతంజలి మహర్షి బలరాముని (శేషుని) అవతారమే. యోగవిద్య నుపాసించు వారు శేషు నారాధించుట సంప్రదాయము. పురుష ప్రయత్నము దైవానుగ్రహముగ సిద్ధించును. అట్టి సిద్ధి నిచ్చు బలరాముని ప్రియమైన తమ్ముడు శ్రీకృష్ణుడు. తమ్ముడనగ తరువాతి వాడు గదా! పురుష ప్రయత్నము గావించువారిని అనుగ్రహించువాడు దైవము. ప్రయత్నమునకు ప్రోత్సహించువాడు బలరాముడు కాగా అనుగ్రహించువాడు శ్రీకృష్ణుడని తెలియవలెను. బలరాముడు సంకర్షణుడు కాగ, శ్రీకృష్ణుడు వాసుదేవుడు.

బలరాము డిచ్చు పురుష ప్రయత్నమున దేహతత్త్వమునందు వలసిన మార్పులు (యోగ) సాధకులకు జరుగును. ఆహారము, నిద్ర, వ్యవహారముల యందు పవిత్రతను చేకూర్చు కొనుచు దేహధాతువులను శ్రేష్ఠముగ నిర్మాణము

గావించుకొనుట సాధనయందొక ముఖ్య భాగము. సార వంతమగు భూమి యందు శ్రేష్ఠమగు పంట ఎట్లు పండునో సారవంతమగు దేహ మందు గ్రంథులు స్రవించి చక్రములు పద్మములై వికసించి భగవదానుభూతి అందించును. శరీర ధాతువులను పునర్నిర్మాణము గావించుకొనుటయే సాధకు నికి ప్రధాన కర్తవ్యమై యున్నది. దేహము ధేనువై గ్రంథులు స్రవించినచో దివ్యానుభూతికి అది ఉపకరణమై నిలచును. ఈ కార్యక్రమమున కధిదేవత సంకర్షణుడైన బలరాముడు.

## 17. పూతనా జీవిత హరః

పూతన జీవమును హరించినవాడు. పూతన కంసునిచే పంపబడిన భూతము. బాలఘాతిని. ఆ కంసుడు అహంకార స్వరూపుడు. దివ్యత్వము పుట్టిన వెంటనే అది పెరుగకుండ సంహరించు స్వాభిమానము కల అహంకారమే కంసుడు. సాధకుని యందు దివ్యత్వమను భావము జనింపగనే అహంకారము అడ్డు పడుచుండును. కొంచెము భక్తి గల వారికే అహంకార మెక్కువ. మిడిమిడి జ్ఞానులే ఎగిరి పడుదురు. పతనము చెందుదురు. అట్లు జరుగకుండవలె నన్నచో ఈ నామమును స్మరింపవలెను.

పూతన యను భూతము పసికందుయైన కృష్ణుని వెదకి కొనుచు వచ్చినది. అతనిని సంహరించుటకు ప్రయత్నించి కృష్ణునిచే సంహరింపబడి మరణించినది.

పూతన అజ్ఞానముతో కృష్ణుని సమీపించినను కృష్ణు

డామెను ప్రేమతో ఉద్ధరించెను. జ్ఞానము కలవారు అజ్ఞానులను ప్రేమతో ఉద్ధరించవలెనే గాని, ద్వేషింపరాదను సూక్ష్మ ధర్మమును పసికందుగ శ్రీకృష్ణుడు బోధించెను.

## 18. శకటాసుర భంజనః

శకటాసురుని సంహరించినవాడు అని అర్థము. శకటా సురుడు కూడ భూతమే. ఈ భూతమును కూడ కంసుడే పసికందుయైన కృష్ణుని హతమార్చుటకు ప్రయోగించినాడు. దీనిని కూడ పసివాడగు కృష్ణుడు సంహరించుట జరిగినది.

కంసునకు ముండకౌశికు డను నేపాళ మాంత్రికుడు గురుత్వము వహించెను. ముండకౌశికుడు చండకౌశికు డను వైదిక తంత్రవేత్త శిష్యుడు. చండకౌశికుడు జరా సంధునకు రాజ గురువు. చండకౌశికుడు కూడ ధర్మపరుడు. ధర్మస్థాపనమునకై తన తాంత్రిక విద్యలను నిర్వర్తించు చుండెడివాడు. అతని శిష్యుడగు ముండకౌశికుడు పక్వము చెందని స్థితిలో కంసు డతనిని నాశ్రయించి అతని అనుగ్రహము పొంది ఎనిమిది భూతములను వశము గావించుకొనెను.

తాంత్రిక శక్తి శీలవంతులకే లొంగునుగాని శీలము

లేని వారికి లొంగదు. ఆపద్ధర్మముగ కంసుడు పూతనాది భూతములను కృష్ణ సంహారమునకై ప్రయోగించెను. అందు శకటాసురుడు రెండవ పిశాచము. ఈ అసురుడు తన బలమును ఒక బండిచక్రమున ప్రవేశింపజేసి కృష్ణునిపైకి దూసుకొనుచు రాగా కృష్ణుడా చక్రమును తన అప్రాకృత శరీర బలముచే తన్నెను. చక్రము ఉవ్వెత్తున ఆకాశము లోనికేగి క్రిందపడి ముక్కలయ్యెను. అటుపైన నిజశరీరము కలిగి అసురుడు నేలపైబడి మరణించెను. బాల కృష్ణుడు తన కాలిచేత శకటమును తన్నగ, అది దివి కెగసినది. కృష్ణుని పాదస్పర్శ వలన క్షణకాలము దివి (స్వర్గ) లోకప్రాప్తి కలిగినది. కాని శకటము ఇరుసు భారము అగుటచే మరల నేలబడి మరణించినది. హరి పాదస్పర్శ వలన శకటా సురుడు క్షణకాలము స్వర్గము ననుభవించెను. అటుపైన స్వకీయ కర్మ కారణముగ మరణించి పునర్జన్మ ప్రాప్తి నందెను. పిశాచము పిశాచ స్థితి వదలి మర్త్యస్థితిని పొందెను.

## 19. నందవ్రజ జనానంది

నంద వ్రజమందలి జనులను ఆనందింపజేసిన వాడని అర్థము. వ్రజమునకు నాయకుడు నందుడగుటచే అది నంద వ్రజమైనది. వ్రజమందలి జనులందరును, నంద లోకమువారే. అనగా ఆనందలోకములలో జీవించువారు. వారికి నందునికి కలిగించినట్లే, కృష్ణుడు అమితానందమును కలిగించెను. అవి యన్నియు కృష్ణుని బాలక్రీడలుగ భాగవత పురాణము నిక్షిప్త పరచినది. ఈ క్రీడలన్నియు ఆధ్యాత్మిక రహస్యములతో కూడినవి. ఆనందమయ లోకమున జీవించువారికి పరమానందము కలిగించునవి. కృష్ణలీలలు ఒక ప్రత్యేక సంపుటి.

# 20. సచ్చిదానంద విగ్రహః

సత్, చిత్, ఆనందము రూపము కట్టుకొనినచో అట్టి రూపము సచ్చిదానంద విగ్రహమై యుండును. సత్ అనగా అస్థిత్వము లేక ఉండుట. చిత్ అనగా చైతన్యము. సచ్చిత్ అనగా పరతత్వము, పరాశక్తుల సమాగమ ప్రజ్ఞ. వారి క్రీడయే సృష్టి. అట్టి సృష్టియందు క్రీడించుటకు వచ్చినవాడు శ్రీకృష్ణుడు.

## 21. నవనీత విలిప్తాంగః

వెన్న దొంగిలించు వాడని అర్థము. నవనీత మనగ అప్పుడే తీయబడిన వెన్న. పెరుగును చిలుకగ వెన్న పుట్టును. పెరుగు స్థిరమతియైన సాధకునికి సంకేతము. సాధకునికి కలుగు ఆటుపోట్లే పెరుగును చిలుకుట. అట్లు చిలుకబడిన సాధకుని హృదయమందు మార్దవత్వ మేర్పడును. అతడు వినమ్రుడై తనను, తన శక్తి సామర్థ్యములను దైవమునకు సమర్పించును. అట్లు సమర్పించుకొనిన వానిని రహస్యముగ నందుకొను దైవము శ్రీకృష్ణుడు. వారిని అట్లు దొంగి లించుట ఇతరులకు తెలియదు. దొంగిలింపబడిన వారికే తెలియును. అప్పటినుండి దొంగిలింప బడినవారు, దొంగి లించినవారు గోపనవిద్య నుపాసింతురు. అనగా రహస్య ముగ (అంతరంగమందు) ఆనందము పొందుట ఒకరి వంతు కాగ ఆనందము ననుగ్రహించుట మరియొకని వంతు. ముందు మొదటివాడు మాధుర్యభక్తి ననుభ

వించును. రెండవవాడు మధురానాథుడు, మధురాధిపతి. ఈ ఆనందము దక్కినవారికి సృష్టియందు ఇతర విషయము లెంత విలువైనవైనను అల్పములే.

## 22. నవనీత నటో అనఘః

పై తెలిపిన నవనీతమును దొంగిలించినను, పాప మంటని వాడు అని అర్థము. దొంగతనము పాపమని శాస్త్రము తెలుపు చున్నది. దొంగిలించినను పాప మంట కుండుటకు కారణము ప్రేమ. దొంగిలింపబడిన వస్తువు దొంగకై వేచియుండుట, కాపు కాచియుండుట అరుదు. కాని ఉన్నతమైన సాధన స్థితిని చేరిన జీవుడు తనను దైవము గ్రహింపవలెనని, అనుగ్రహింపవలెనని తపన చెందు చుండును. అట్టి తపనకు ప్రతిస్పందనమే దైవానుగ్రహము. అనుగ్రహించుట రహస్యముగ జరుగును కనుక దొంగి లింపుగ వర్ణింపబడినది. ఇట్టి దొంగకు పాప మేల అంటును?

## 23. నవనీత నవాహారః

క్రొత్తగా తీయబడిన వెన్నను క్రొత్తగా దొంగిలించువాడు శ్రీకృష్ణుడని అర్థము. వెన్న క్రొత్తది, దొంగతనము క్రొత్త విధానమే. ఇది కృష్ణుని లీల.

శ్రీకృష్ణుని బాలక్రీడలలో వెన్న దొంగిలించుట ప్రధాన మగు క్రీడ. ఏ ఇంటిలో వెన్న తీయబడినను ఆ యింటిలో ఆ రాత్రే వెన్న దొంగిలింపబడును. ముందు జరిగిన దొంగతనమువలె కాక ప్రతి దొంగతనము నూతనముగ నుండును. అపూర్వమై యుండును.

వెన్న సంస్కరింపబడిన మానవ హృదయమునకు చిహ్నము. నిర్మలము, నిష్కల్మషము, మార్దవము సంస్క రింపబడిన హృదయ చిహ్నములు. అట్టి హృదయము కలవారిని దైవ మనుగ్రహించు చుండును. అట్టి హృదయ మేర్పడగనే అనుగ్రహము వర్షించును. ఒకరిని అనుగ్ర

హించిన తీరుగ మరియొకరిని అనుగ్రహించుట యుండదు. అనుగ్రహ మెప్పుడునూ నూతనమే అయి ఉండును. ఇది దైవ విలాసము. ఈ నామము రహస్యముగ పై తెలిపిన విలాసమును సూచించు చున్నది.

## 24. ముచికుంద ప్రసాదకః

శ్రీకృష్ణుడు ముచికుందుని అనుగ్రహించినవాడు. ముచికుందుడు శ్రీకృష్ణుని భక్తుడు. శ్రీకృష్ణుని కొరకై వేల సంవత్సరములు తపస్సు చేసినవాడు.

ముచికుందుడు సూర్యవంశపువాడు. విష్ణు ఆరాధన సతతము గావించువాడు. అంబరీషుడు, పులుకుత్సుడు అతని సోదరులు. అతడు రాజర్షి. అంబరీషునివలెనె విష్ణుని ఆరాధనము గావించుచు, రాజ్యము నేలినవాడు. అతని రాజ్యపాలనకు హర్షించి కుబేరుడు ప్రపంచమందలి సంపద నంతను బహుమతిగ నిత్తునని తెలిపినపుడు, ముచి కుందుడు స్వశక్తిపై సంపాదించిన ధనమే తనకి తృప్తి నిచ్చునని, బహుమానముగ పొందు ధనము తనకి వలదని వినయముగ నిరాకరించెను. అట్టి బహుమతి నొసగుటకు పూర్వము కుబేరుడు ముచికుందుని పరాక్రమమును పరిశీ లించుటకు అతనితో యుద్ధము చేసెను. యుద్ధమున ముచి కుందుడు ఓడిపోవుచుండగ తన కులగురువగు వశిష్ఠుని

ప్రార్థించి యుద్ధమున గెలిచెను. కుబేరుడు సంతోషించి సంపదను ప్రసాదింపగా, నిరాకరించెను. ముచికుందుడు అమితముగ గోవులను దానమిచ్చుచుండెను. అతడు జన్మతః శాకాహారి. పూర్వ యుగముల యందు శాకాహారిగ జీవితమును గడిపిన అతి కొద్దిమంది మహాత్ములలో ముచికుందు డొకడు.

అట్టి ముచికుందుడు విష్ణు దర్శనమునకై తన వాన ప్రస్థమున గుహలో వేల సంవత్సరములు ధ్యానము గావించెను. ద్వాపరమున శ్రీకృష్ణుడు అతనికి దర్శనమిచ్చి పరితృప్తుని గావించెను. భూమిపై తిరుగాడిన అత్యంత మహత్తర మగు విష్ణు భక్తులలో ముచికుందు డొకడు. ముచికుందుని అనుగ్రహించుటద్వారా శ్రీకృష్ణుడు తాను శ్రీ మహావిష్ణువే యని ప్రకటించెను. అతడు అంతర్యామి దైవమే అయినను, అప్రకటితుడు. తన మాయచేత తానెవరో యితరులకు తెలియనీయక జగత్కల్యాణమగు కార్యము లను చక్కబెట్టినాడు.

## 25. షోడశస్త్రీ సహస్రేశ

పదహారువేల స్త్రీలను (షోడశ - 16; సహస్ర - 1,000; స్త్రీ -స్త్రీలు; ఈశ - భర్త) అనుగ్రహించి, వారికి తన భార్యలస్థితిని కల్పించినవాడు.

నరకాసురుడు ఎందరో రాజకన్యలను చెఱబట్టినాడు. నరకాసుర వధానంతరము ఈ స్త్రీలందరును చెఱనుండి విడిపింపబడిరి. చాలకాలము చెఱ యందుండుటచే, వారిలో వయసు మీరినవారు, తల్లిదండ్రులను కోల్పోయినవారు, అన్నదమ్ముల ఆదరణ లేనివారు మిక్కుటముగ నుండిరి. వారందరనూ తమ భవిష్యత్తు ఏమి యని కృష్ణుని ప్రశ్నించిరి. తమ కెవ్వరు దిక్కని ఆవేదన తెలిపిరి. చెఱనుండి విడి పించుట వలన తమకు జీవనమే సమస్య అయినదని వాపోయిరి. దిక్కులేని స్త్రీల మైతిమని దుఃఖపడిరి. శ్రీకృష్ణుడు వారి పరిస్థితిని గమనించి వారనాథలు కాకూడదని తానే

నాథుడుగ నుందునని పలికి, అందరికి ఆశ్రయ మిచ్చిన వాడు. వారందరి రక్షణ, పోషణ భారమును స్వీకరించిన మహత్తర సంఘ సంస్కర్త శ్రీకృష్ణుడు. తన అష్టభార్యలకు ఎట్టి గౌరవము లభించునో అట్టి గౌరవమే వారికిని కలుగు నట్లు సమస్త సౌకర్యములను ఏర్పరచినాడు. వారందరును (16 వేలమంది) శ్రీకృష్ణుడే తమ భర్త యని భావించుచు, శ్రీకృష్ణుని ఆరాధించుచు జీవించినారు. ఇది కృష్ణుని జీవిత మున ఒక అపూర్వ సంఘటన.

ఈ నామమునకు యోగపరముగ రహస్యార్థమును కూడ తెలుపవచ్చును. మానవ దేహము దైవ సృష్టియందు పరాకాష్ఠ. విశ్వమునంతను మానవ రూపమున తీర్చిదిద్ది దైవమందు నివసించు చుండును. మానవదేహమున పద హారువేల ప్రజ్ఞలు ఉన్నట్లుగ ఋషులు గుర్తించిరి. ఈ పదహారువేల ప్రజ్ఞలకు దైవమే పతి. వానిని ధరించువాడు దైవమే. భరించువాడూ దైవమే. ఇవియే భగవంతుని పదహారు

కళలు. మూడు లోకముల యందున్నవి కనుక మూడు సున్నలు జేర్చగ 16 వేలగును. అమ్మవారిని 'షోడశి' అందురు. దానికి మూలమైనవాడు శ్రీకృష్ణుడు. అతడు కనబడడు. అతని కళలే వెలుగుచుండును. కనబడనివాడు కనుకనే అతడు కృష్ణుడు.

## 26. త్రిభంగి

మూడు భంగిమలతో నిలబడువాడు. మోహనాకారుడైన శ్రీకృష్ణుడు శిరస్సు నొక భంగిమ యందు, ఉరస్సు నొక భంగిమ యందు, కటి ప్రదేశము నుండి పాదముల వరకు మరియొక భంగిమయందు నిలిపి వేణుగానము చేయుచు నుండును. అందుచే అతనిని 'త్రిభంగి' యందురు. ధ్యానమునకు అత్యంత ప్రశస్తమైన ఈ మూర్తి ఎందరికో మధురభక్తిని అనుగ్రహించెను.

భగవంతుని త్రిభంగిమ ప్రజ్ఞ, శక్తి, పదార్థములతో కూడిన మూడు లోకములను కూడ సూచించును. ఈ మూడు లోకములకు అధిపతియై తానే యున్నానని ఈ భంగిమ తెలుపు చున్నది. అతడు పరా వాక్కుకాగా, పశ్యంతి, మధ్యమ, వైఖరి వాక్కులుగ ప్రజ్ఞాలోకములు, శక్తిలోకములు, పదార్థలోకములు ఏర్పడుచున్నవి.

త్రిగుణములకు కూడా తానే అధిపతి యని ఈ భంగిమ తెలుపుచు నుండును. తాను త్రిగుణాతీతుడై త్రిగుణముల యందు కూడ వర్తించుచుండును. త్రిలోకములు, త్రిశక్తులు, త్రిగుణములు, త్రిమూర్తులు అన్నిటికిని, అందరికిని నేనే స్వామిని అని చాటు మధురమైన ధ్యానమూర్తియే ఈ త్రిభంగిమూర్తి.

## 27. మధురాకృతిః

మధురమైన ఆకృతి కలవాడు శ్రీకృష్ణుడు. సృష్టి పుట్టినది మొదలు నేటివరకు శ్రీకృష్ణుని యంత మధురమగు ఆకృతి మరియొకటి లేదు. రాముడు శ్యామలుడు, కోమలుడు, అత్యంత సుందరాకారుడు. రామునికన్న మధురమైన ఆకృతి కలవాడు శ్రీకృష్ణుడు. పూర్ణపురుషు డగుటచే అతని ఆకృతి పరిపూర్ణము. అందువలన అతడు మధురాకృతి కలవాడని, మధురానాథుడని పిలువబడు చున్నాడు. తన్మ యత్వము కలిగించుట మధురత్వము యొక్క గుణము.

శ్రీకృష్ణుని ముఖము మధురము. కన్నులు మధురములు. పెదవులు మధురము. చిరునవ్వు మధురము. అతని హృద యము మధురాతి మధురము. అతని నడక మధురము. మాట మధురము. చరిత్ర మధురము. అతడు ధరించు వస్త్రములు మధురము. ఆభరణములు, అలంకారములు

మధురములు. కన్నుల కదలిక మధురము, కనురెప్పపాటు కూడ మధురము. అతని వేణువు మధురము. అతని పాదరేణువు మధురము. అతని హస్తము లత్యంత కోమల ములై మధురముగ నుండును. పాదములు హస్తములతో సరిసమానముగ మధురములు. అతని నృత్యము సృష్టినే తన్మయింపజేయగల మాధుర్యము కలది. అతనితో స్నేహము మధురము. అతనందించు వేణుగానము మధురము. అతనితో చల్దులు భుజించుట మధురాతి మధురము. అతనితో నిద్రించుట కూడ మధురమే. అతని కస్తూరి తిలకము మధురము.

శ్రీకృష్ణుని చేతలు కూడ మధురమే. అవి ఎవ్వరికినీ అంతు బట్టునవి కాక ఉత్కంఠభరితములై యుండును. అత డను గ్రహించు విధానము, జీవులకు మోక్షము నిచ్చు విధానము కూడ మధురమే. అతడు వెన్న దొంగిలించినను, భక్తుల హృదయములను దొంగిలించినను మధురమే. అతని

రసక్రీడ రమణుల కందరికిని తన్మయత్వము కలిగించి శాశ్వతానందమున ముంచినది.

అతడు శత్రువులను వధించినప్పుడు వధింపబడిన జీవి మధురానుభూతిని పొందెను. ఇది నిరుపమానము. శ్రీకృష్ణుడు కష్టములను తీర్చి శాంతిని ప్రసాదించుట కూడ మధురమే.

అతడు ధరించు మాలలు మధురము. అతడు విహరించు కుంజవనము మధురము. అతడు చరించిన యమునా నదీ తీరము మధురము. అచటి గాలి నేటికిని మధురమే. అతడి పాదములను సోకిన యమునా నది నీరు, కమలములు, ఆ మాధుర్యస్ఫూర్తిని నేటికిని అందించుచున్నవి.

శ్రీకృష్ణునితో క్రీడించిన గోపగోపీ జనులు కృష్ణ మాధుర్య మునే ప్రసరించు చుందురు. శ్రీకృష్ణుని సమస్త లీలలు మధురమే. అతని యుక్తి మధురము, పరిష్కారములు

మధురములు. శ్రీకృష్ణుని దృష్టి మధురము, ఆశ్రితులను రక్షించు విధానము మధురము. అతని ప్రతి చర్య అత్యంత అనూహ్యమై, రహస్యమై, ఉత్కంఠభరితమై యుండును. వ్రజమందు అతనిని పరివేష్టించిన ఆలమందలు సైతము మాధుర్యమున మునిగి ఇతరులకా మాధుర్యము నందించినవి. శ్రీకృష్ణుని సృష్టి యజ్ఞార్థ జీవనము మధురాతి మధురములు. కృష్ణభక్తి కలవారికి లభించు ఫలితము మధురము. అఖిలము, మధురము అను తెలుపు నామము యిది - 'మధురాకృతిః.'

## 28. శుక వాగమృతాబ్ధిర్ ఇందుర్

శుకుని వాక్కు అను అమృత మయమగు సముద్రము నకు పూర్ణచంద్రుని వంటివాడు శ్రీకృష్ణుడు. అమృతాబ్ధి అనగా అమృత సముద్రము. శ్రీ శుకుని వాక్కు అమృత సముద్రము వంటిది. అనగా పరిమితులు లేని అమృతత్త్వ మును కలిగించునది. దైవ తత్త్వమునుగూర్చి, కృష్ణతత్త్వ మును గూర్చి పలికినచో శుకుడే పలుకవలెను. అతడు శ్రీకృష్ణుని గూర్చి పలుకుచుండగనే వినువారికి అమృతత్త్వ స్థితి లభించును. పరీక్షిత్తును తన వాక్కు చేతనే శ్రీ శుకయోగి మరణమునుండి ఉద్ధరించినాడు. భాగవతోత్తము లలో ప్రథముడు శ్రీ శుకుడు. అతడు వాగ్ రూపమున నందించు కృష్ణ తత్త్వము మధురము మరియు అపారము. ఆ వాక్ సముద్రమునకు పూర్ణచంద్రుని వంటివాడు శ్రీకృష్ణుడు. పూర్ణచంద్రుని సాన్నిధ్యమున సముద్రము పొంగును. ఆహ్లాదమును కలిగించును. అట్లే శ్రీకృష్ణుని

పరిపూర్ణ సాన్నిధ్యము నందు జీవించు శ్రీ శుకుని నుండి అపారముగు మధురభక్తి రూపమున జ్ఞానము ప్రకటిత మయ్యెను. అదియే శ్రీమద్ భాగవతము. ఆ మహా గ్రంథమునకు కథానాయకుడు శ్రీకృష్ణుడు.

## 29. గోవిందః

గోవింద నామము మిక్కిలి ప్రసిద్ధిగాంచిన శ్రీకృష్ణ నామము లలో ఒకటి. గోవిందు డనగా గోవుల యజమాని అని అర్థము. సూర్యకిరణములను గోవులందురు. అవి సూర్యుని ద్వారా ప్రసరించు చున్నవి కాని సూర్యునివి కావు. "నానుండి సమస్తము సూర్యునికి అందుచున్నవి" అని కృష్ణుడు పలికినాడు. సూర్యునికి సవితృ నుండి సవితృకు, ఆదిత్యుని నుండి ఆదిత్యునికి అంతర్యామియైన నేను అను ప్రజ్ఞనుండి సర్వప్రజ్ఞలు, సర్వశక్తులు ప్రసరించు చుండును. అట్టి అంతర్యామి ప్రజ్ఞ శ్రీకృష్ణుడు.

గోవులనగా గ్రహములని కూడ అర్థమున్నది. సూర్యుని నుండి వచ్చు సప్తకిరణముల ద్వారా ఏర్పడునవే సప్త గోళములు. వాని యజమాని కూడ దైవమే. సూర్యుని నుండి, గోళముల నుండి మానవులకు నేను అను ప్రజ్ఞతో కూడి ఏడు కేంద్రము లేర్పడుచున్నవి (సహస్రారము నుండి

మూలాధారము వరకు). వీటిని యోగమున చక్రములని, పద్మములని అందురు. వీనినుండి రసములు స్రవించి సప్తధాతువులతో కూడిన పరిపూర్ణ మానవ దేహ మేర్పడు చున్నది. ఇవియును గోవులే. వీనిని కామధేనువులని కూడ అందురు.

నేను అను ప్రజ్ఞనుండి బుద్ధిలోనికి, బుద్ధినుండి మనస్సు నకు, మనస్సు నుండి ఇంద్రియములకు ప్రసరించు చైతన్యము కూడ గోవులే. సృష్టి అంతయు ఇట్లు ఒకే ప్రజ్ఞనుండి వివిధములగు ప్రజ్ఞలు పుట్టుట, వివిధ లోకములు పుట్టుట, అందు లోకస్థులు పుట్టుట జరుగుటకు ఆధారము కిరణములే. అవి ప్రజ్ఞా మయములు, ప్రాణమయములు. వాటిని ఋషులు గోవులని సంకేతించిరి. ఆ గోవులను పాలించువాడు గోపాలుడు. వాటి యజమాని గోవిందుడు. భూమిపై అవతరించినపుడు కూడ గోవులను పాలించుచు వ్రజమున జీవించి వైచిత్రి చూపినవాడు గోవిందుడు.

## 30. యోగినాం పతిః

యోగులకు యోగి. యోగుల గమ్యము. యోగులకు ఈశ్వరుడు అని అర్థము. శ్రీకృష్ణుని ఒక్కనినే యోగేశ్వరు డని పిలుతురు. యోగీశ్వరు డనగా తమను తాము తెలిసిన వారు. అట్టివారికి కూడ ఈశ్వరత్వము వహించువాడు అగుటచే అతనిని యోగేశ్వరు డందురు. అతడు సర్వాంత రాత్మకుడు. అందరి ఆత్మల యందు వశించి వారి వృద్ధికై తోడ్పడువాడు. తన యందలి దైవము తెలియుట ఒక వంతు. అందరి యందలి దైవము తెలియుట మరియొక వంతు. అందరి యందు దైవముగ నుండుట శ్రీకృష్ణుని వంతు. అందువలన అతను యోగులకు పతి.

## 31. వత్సవాటచరః

వత్సవాటము లనగా దూడల గుంపులు. వత్సము లనగా ప్రేమపాత్రములు. వాత్సల్యమునకు నోచుకొనినవి. లేగ దూడలను ఆవులు వాత్సల్యముతో నాలుకతో నాకుచూ ప్రేమ నందించును. వాత్సల్య మనగా ఇదియే. వత్సములకు ఆవులు చూపు ప్రేమను వాత్సల్య మందురు. అది ప్రేమకు పరాకాష్ఠ. ఆ ప్రేమయందు రక్షణ పోషణాదులున్నవి. వత్సవాటము లనగా అట్టి వత్సముల గుంపు. ప్రేమకు పోషణమునకు పాత్రులైనవారి మధ్య చరించువాడు శ్రీకృష్ణుడు.

## 32. అనంతః

అతడు అనంతుడు. అనగా అంతము లేనివాడు. శాశ్వతుడైన శ్రీకృష్ణుడు నిర్మలమగు ప్రేమానురాగము కలవారితో చరించు చుండునే గాని పండితులు, శాస్త్రకారులు, వీరులు, శూరులు, జ్ఞానులు, యోగులు మొదలగువారిని అపుడపుడు అనుగ్రహించు చుండుట మాత్రమే చేయుచుండును. వత్సలులతో జీవించు చుండును.

## 33. ధేనుకాసుర భంజనః

ధేనువు రూపమున ప్రవేశించిన అసురుని చంపినవాడు శ్రీకృష్ణుడు. తను పరిపాలించుచున్న దూడల సమూహ మందు చేరిన అసురుని గుర్తించి శ్రీకృష్ణుడు సంహరించెను. అమాయకుల బృందమున చేరు స్వార్థపరులను కూడ దైవ మిట్లే నిర్జించును. అమాయకులు అనగా మాయ చేయు తెలివిలేనివారు. మాయా మోసములు వీరికి తెలియవు. ఇతరులు మాయచేసినను, మోసగించినను గ్రహించలేరు. వారిని వారు రక్షించుకొను ప్రయత్నము కూడ వారు చేయరు. దైవమే ఆధారముగ ఆడుతు పాడుతు జీవించు వారు. అట్టివారిని మోసము చేయుట సులభము. స్వార్థము నకై వినియోగించుట సులభము. వారిని వారు రక్షించుకొను భావము కూడ లేనివారిని దైవమే రక్షించు చుండును. అట్టి వత్సములతో తిరుగుచున్న శ్రీకృష్ణుడు లేగదూడ ముసుగులో దాగియున్న అసురుని గుర్తించెను. ఆ

అసురుడు తనను సంహరించుటకు అందు చేరెనని గుర్తించెను. దానిని సంహరించెను.

మంచివారిలో చేరు అసురత్వమును కూడ దైవమే నిర్జించు నని రహస్యార్థము. కాలమును, కర్మమునుబట్టి మంచివారి యందుకూడ (దైవీభావమున నుండువారు) అసుర భావములు కలుగవచ్చును. కాని వారు దైవారాధకు లగుటచే వారియందలి అసుర భావమును దైవమే నిర్జించి నిర్మూలించును. అందులకే దైవమునకు ఆశ్రితరక్షకు డని బిరుదు గలదు.

## 34. తృణీకృత తృణావర్తః

తృణావర్తుడను రాక్షసుని సంహరించినవాడు అని అర్థము. కంసునిచే పంపబడిన తృణావర్తుడు సుడిగాలి రూపమున బాలకృష్ణుని ఎగరేసుకొని పోగా అతనిని కృష్ణుడు సంహరించెను. అసురుడు సంహరించుటకై ప్రయత్నింపగ సంహరింపబడెను.

తృణావర్తుడనగా జీవులను దుఃఖమయమగు సంసారము నందు, భోగవిషయముల యందు, గడ్డిపోచ లను త్రిప్పునట్లు గిరగిర త్రిప్పువాడు. జీవులను అజ్ఞానమున బంధించి జనన మరణాదుల యందు త్రిప్పు అసుర ప్రజ్ఞయే తృణావర్తుడు. అతడు దైవమునే అట్లు త్రిప్ప జూచెను. సృష్టి చక్రమును త్రిప్పు శ్రీకృష్ణుడు అజ్ఞాన చక్రమున తిరుగుచున్న తృణావర్తుని సంహరించి ఉత్తమ లోకములను ప్రసాదించెను.

జీవులను గడ్డిపోచలవలె త్రిప్పుచు నుండు తృణావర్తుని గడ్డిపోచవలెనే శ్రీకృష్ణుడు భావించెను. అతని అహంకారమును హరించెను.

## 35. యమళార్జున భంజనః

బలమైన మద్దిచెట్లను కూల్చినవాడని అర్థము. మద్ది చెట్లను స్వబలముతో కూల్చుట చాల కష్టము. బలమైన మద్దిచెట్ల జంటను కూల్చుట మరింత కష్టము. ఆయుధ ములు లేక కూల్చుట, అంతేకాక కట్టుబడి యున్నప్పుడు కూల్చుట చాల కష్టము. పసిబాలుడుగ కూల్చుట దుస్సాధ్యము.

బాలుడైన శ్రీకృష్ణుడు రోటికి కట్టబడి యున్నప్పటికి రోటి నీడ్చుకొనుచు, మద్దిచెట్లను కూల్చి నలకూబరులు అను కుబేరుని కుమారులకు శాప విమోచనము గావించెను. నారద మహర్షి, నలకూబరుల బాధ్యతారహిత ప్రవర్తనము నకు కోపించి శపించెను. శ్రీహరి కారణముగ శాపవిమో చనము కలుగునని ఆశీర్వదించెను. మహర్షి వాక్కును సత్యము చేయుటకై శ్రీకృష్ణుడు మద్దిచెట్ల జంటను కూల్చెను.

నలకూబర మణిగ్రీవులు విశుద్ధి యందలి స్వరపేటికకు సంబంధించిన ప్రజ్ఞలు. స్వరపేటిక వలననే వాక్కు జనించును. వాక్కును బాధ్యతారహితముగ వాడుట వలన జీవులు తమను తాము బంధించుకొను చున్నారు. బాధ్యతా రహితమగు వాక్కుల నుండి జీవులను రక్షించుటకు సద్గురువు దీక్షను, తపస్సును అందించును. ఆ తపోదీక్షయే మద్దిచెట్లవలె పడి ఉండుట. ఇచ్చట తెలుపబడిన తపస్సు వాఙ్మయ తపస్సు. ఇది సిద్ధించుటకే నారదుడు శాప మిచ్చెను. కృష్ణ స్పర్శ వలన నలకూబరులు సిద్ధిని పొందిరి. అనగా వాఙ్మయ తపస్సు గావించు దీక్షాపరులకు దైవము సాన్నిధ్య మిచ్చి సిద్ధిని కలిగించెనని భావము.

## 36. ఉత్తాల తాల భేత్తాచ

ఎత్తైన బలమైన తాటిచెట్లను కూల్చినవాడు అని అర్థము. ఇది రామావతారమందలి సంఘటన. సుగ్రీవుడి కోరిక మేఱకు అత్యంత ఎత్తు, బలము కలిగిన తాటిచెట్టు ఏడు తలలను ఒక్క బాణముతో శ్రీరాముడు భేదించినాడు. అది యొక అపూర్వ సంఘటన. రాముని దివ్యబలమునకు సంకేతము.

ఏడు తలల తాటిచెట్టు ఏడు పొరల మనిషికిని, ఏడు లోకముల సృష్టికిని సంకేతము. రాముని ప్రజ్ఞ ఏడు లోకములను ఛేదించగల దివ్యప్రజ్ఞ. ముందు నామమున కేవలము విశుద్ధిని గూర్చియే తెలుపబడినది. వెనువెంటనే ఈ నామము ప్రయోగించి ఏడు లోకములను, మానవుని యందలి ఏడు ప్రజ్ఞలను ఛేదించగల దివ్యప్రజ్ఞ శ్రీకృష్ణుడని, అతని పూర్వ అవతారమే శ్రీరాముడని ఈ నామము ప్రకటించు చున్నది.

## 37. తమాల శ్యామలాకృతిః

కోమలమైన, శ్యామలమైన ఆకృతి కలవాడు శ్రీకృష్ణుడు అని అర్థము. మానవాకృతులలో శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, అత్యంత కోమలమైన రూపములు కలవారని ఋషుల దర్శనము. వారిరువురును కోమలులే. వారి కోమలత్వము వర్ణింప నలవి కానిది. వారి సౌకుమార్యమునకు, సౌందర్యమునకు మోహములు దాటిన ఋషులు కూడ మోహము చెందిరి.

వారిరువురిది శ్యామలాకారమే. అనగా లేత నీలిరంగు కాంతి. ఈ కాంతి సప్తవర్ణములకు మూలము. నారాయణ కాంతి యిట్లుండునని ఋషులు విశదీకరింతురు. వేదములందు నారాయణుని ఈ కాంతి రూపము కలవానిగనే ఋక్కులందు తెలుపబడినది.

రామకృష్ణుల రూపములను ధ్యానము చేయుట వలన పరవశత్వము కలుగును. వారి నీలకాంతి ఆవరించి భక్తులను బ్రోచును.

## 38. గోపగోపీశ్వరః

గోపకులకు, గోపికలకు ఈశ్వరుడైనవాడు. గోపకులు, గోపికలు దైవానుభూతిని రహస్యముగ అనుభూతి చెందు జీవులు. గోపన మనగా దాచుకొనుట. గోపగోపికలు వారి హృదయము లందు దైవమును పదిలపరచుకొని అతడే సమస్తమునకు భర్త యని భావించి అతని నాశ్రయించి, అతనితో క్రీడించి, రమించి, రసానుభూతిని పొందిరి. వారికి శ్రీకృష్ణుడే ఈశ్వరుడు, జగదీశ్వరుడు. సమస్తమునందును శ్రీకృష్ణుని దర్శించుచు కృష్ణ సాన్నిధ్యమున ఆనందముగ జీవించినవారు కృష్ణ భక్తులలో (దైవభక్తులలో) వారే శ్రేష్ఠులని నారద మహర్షి పలికెను. అట్టి భక్తులకు స్వామి అని శ్రీకృష్ణునికి లోకమున బిరుదు కలిగినది.

## 39. యోగి

సమస్తమగు సృష్టిని తన యోగమాయచే నిలిపినవాడు శ్రీకృష్ణుడు. అతడు యోగేశ్వరుడు. యోగుల ననుగ్రహించు వాడు. అన్నిటిని సమన్వయించువాడు. అందరికిని గమ్య మైనవాడు. భగవద్గీత రూపమున యోగము బోధించినవాడు. యోగమును నిర్వర్తించి చూపినవాడు. యోగసిద్ధులను నిర్వర్తించినవాడు.

యోగి అను పదమునకు పరిపూర్ణమగు అర్థము శ్రీకృష్ణుడే. పదార్థమును, పరమార్థమును సమపాళముగ మన్నించిన వాడతడే. బహుకుటుంబియైనను ఏకాంతు డతడు. సకలభోగముల యందును యోగస్థితియందే యుండెను. యోగస్థితికి అనంగీకారమగు విషయము లేవియు లేవని నిరూపించినవాడు. అతడు యుద్ధమున, రాజకీయమున కూడ యోగస్థితినే ప్రదర్శించెను. చెదరని

యోగస్థితికి శ్రీకృష్ణు డొక్కడే ఉదాహరణము. త్రిమూర్తులు సహితము అపుడపుడు యోగస్థితి నుండి చెదరిరిగాని, శ్రీకృష్ణు డెన్నడునూ చెదరలేదు. అతడే యోగి. అతడే గురువు. యోగులకు గురువులకు కూడ గమ్యము.

## 40. కోటిసూర్య సమప్రభః

కోటిసూర్యులతో సమానమగు వెలుగు గలవాడు శ్రీకృష్ణుడు. చూచువారలకు చూపగలిగినంత కనబడు వాడతడు. కొందరికి నల్లనివాడు, నల్లదనము నుండి కోటిసూర్యుల కాంతి వరకు అన్నిదశల అనుభూతి కృష్ణుని యందు గోచరింపగలదు. ముచికుందుని గూర్చి ముందు నామములో వివరించుట జరిగినది. అతడు మహా తపస్వి. శ్రీకృష్ణ భక్తులలో చాల ముఖ్యుడు. వేల సంవత్సరములు తపోనిష్ఠలో నున్నవాడు. అతడు కన్నులు తెరచి చూచి నప్పుడు అతని నుండి ప్రసరించిన కాంతి కాలయవను డను భయంకర రాక్షసుని భస్మము చేసెను. అట్టి కాంతిగల కన్నులు కలవాడు ముచికుందుడు. అట్టి ముచికుందునికి శ్రీకృష్ణుడు దర్శన మీయగా చూడలేకపోయెనట. శ్రీకృష్ణుని కాంతిని చూడలేక కన్నులు మూసుకొనెనట. ఒక్కసారిగ కోటి సూర్యుల కాంతిని దర్శించిన అనుభూతి ముచికుందు నకు కలిగెనట. అట్టివాడు శ్రీకృష్ణుడు.

## 41. ఇలాపతిః

ఇల అనగా భూవలయము. దానిని భరించువాడని అర్థము. భూమికి భర్త శ్రీకృష్ణుడని అర్థము. సమస్తమునకు భర్తయైన వాడు భూమికి కూడ భర్తయే. భూభారమును ఎప్పటి కప్పుడు తొలగించుచు భూమి ననుగ్రహించు చుండును. భూమి సమస్త జీవకోటిని భరింపగ, భూమిని భరించువాడు, ధరించువాడు శ్రీహరియైన కృష్ణుడు. వరాహ రూపమున జలమయమైన భూమిని ఉద్ధరించినవాడు, అధర్మము పెరిగినపుడెల్ల భూమి ప్రార్థనల నంగీకరించి, భూమిపై అవతరించి, ధర్మము నెలకొలుపుచు నుండువాడు.

## 42. పరంజ్యోతిః

సమస్తలోకములకు ఆవలియైన దానిని పరము అందురు. పరమపదము అందురు. అది వెలుగు. చీకట్లను దాటిన వెలుగు. అది కన్నులకు కనబడెడి వెలుగు కాదు. ఆ వెలుగు ఆధారముగనే కన్ను చూచుచున్నది. చీకటిని కన్ను చూడ లేదు. చీకటికి ఆవల నున్న వెలుగెట్లు కనబడగలదు? సమస్తము వెలిగినప్పుడు కనబడును గాని, వెలగనప్పుడు కనబడదు కదా! సూర్యుడు, చంద్రుడు కూడ ఆ వెలుగు కారణముగనే వెలుగుచున్నారు. అన్ని వెలుగులు ఆ వెలుగులో వెలిగెడివే. ఈ వెలుగు లేవియు లేనపుడు కూడ వెలిగెడిది పరంజ్యోతి. దాని పేరు శ్రీకృష్ణుడు. సమస్త సృష్టి లయమైనపుడు మిగిలెడి ఒకే ఒక వెలుగు శ్రీకృష్ణుడు. మరల ఆ వెలుగుల నుండే కాలము, ప్రకృతి, శక్తి వెలుగొందును. ఇందువలన శ్రీకృష్ణుడే పరంజ్యోతి. అతడే పరంధాముడు.

## 43. యాదవేంద్రః

యాదవులలో ఇంద్రునివంటి వాడని అర్థము. యాదవులలో శ్రీకృష్ణుడు శ్రేష్ఠుడు. సృష్టికే అతను శ్రేష్ఠుడు, జ్యేష్ఠుడు. యాదవులకు కూడ శ్రేష్ఠుడు. యాదవులు కృష్ణుని ఇంద్రునివలె కొలిచిరి. ఇంద్రుని కొలుచువారందరు అతని పరాక్రమమును, వైభవమును చూచి కొలుతురే కాని, దివ్యత్వమును చూచి కాదు. యాదవులు కృష్ణుని పరాక్రమమును కొలిచిరి, కృష్ణుని వైభవమును కొలిచిరి. కృష్ణుని కొలువలేదు. ఇది లోకసామాన్యము. అధికారము, సంపద ఉన్నవారిని అందరునూ కొలుతురు. ఈ కొలువు భక్తి కొలువు కాదు. భయము కారణముగ కలుగు భక్తి. శ్రీకృష్ణుడు యాదవుల యందు మకుటము లేని మహారాజు.

## 44. యదూద్వహః

యాదవులను భరించినవాడు, యాదవులలో శ్రేష్ఠుడు, యాదవులను రక్షించినవాడు అని అర్థము.

జరాసంధుని బారినుండి యాదవులను రక్షించినవాడు శ్రీకృష్ణుడు. యాదవులు కృష్ణుని మహిమ తెలియనివారు. తమలో ఒకనిగను, తమ తోటివానిగను కృష్ణుని భావించిరే గాని, దైవమని గుర్తింపలేదు. తనను గుర్తింపనప్పటికిని తనవారిగ భావించి రక్షణ పోషణాదులు యాదవులందరికి ఏర్పరచినవాడు శ్రీకృష్ణుడు. గుర్తింపనివారిని కూడ రక్షించి పోషించుట దివ్యగుణము. యాదవులనే గాక సృష్టిజీవులను, సృష్టిని కూడ దైవమిట్లే భరించుచు నుండును. నిజమగు ప్రేమ కలిగినవారే యిట్లు చేయగలరు.

యాదవు లహంకారులై వారి వారి గొప్పదనము చాటు కొనుచు బ్రతికిరి. తమ గొప్ప చాటుకొనుట, యితరుల

గొప్పను నిరసించుట వారి సహజ ప్రవృత్తిగ నేర్పడినది. ఎవరికి వారే మహానుభావులు. ఇట్టివారి నందరిని భరించిన వాడు శ్రీకృష్ణుడు. అతడు సాక్షిగనే వారందరూ ఒకరినొకరు చంపుకొని మరణించిరి. అదియునూ భరించినవాడు శ్రీకృష్ణుడు.

## 45. వనమాలి

వనమాలను ధరించువాడు అని అర్థము. కృష్ణు డెప్పుడునూ తులసిమాలలు, పుష్పమాలలు ధరించి యుండెడివాడు. అతనికి ఆభరణములకన్న వనమాలలే ఎక్కువ ప్రీతి. అతని కట్టు, బొట్టు తీరు విశిష్టముగ నుండెడిది. ఇతరులు ఆభరణములు ధరించగ అతడు వనమాలలను ధరించును. ఇతరులు మణిమయ బంగారు కిరీటములను ధరింపగ అతడు నెమలి పింఛములు ధరించెను. క్షత్రియుల మనుకొనుచు తన బంధువు లందరు ఆయుధములు ధరింపగ అతడు వేణువు ధరించెను. వైష్ణవుల మనుకొనుచు అందరును ఫాలములపై త్రిపుండ్ర ములను ధరింపగ అతడు కేవలము కస్తూరి తిలకము ధరించెను. వైష్ణవులు శంఖ చక్రములను భుజములపై ముద్రించుకొనగ, దివ్య శంఖ చక్రధారి యైన తాను ఏ చిహ్నములను ధరించలేదు. ఇతరులు వైష్ణవుల మటంచు

వార్త ప్రకటించుచు జీవించగ, తాను తానుగనే యుండెను. అతడు క్షత్రియుల యందు క్షత్రియుడుకాడు కాని నిజమగు క్షత్రియుడు. అతడు వైష్ణవుల యందు వైష్ణవుడు కాడు కాని అతడే శ్రీ మహావిష్ణువు. ఋషులు, మునులు, యోగులు, గృహస్థులు అను ప్రమాణములు వారివారి కుండగ అతడు అన్నిటా వర్తించెనే కాని వారు ఏర్పరచిన ప్రమాణములకు లొంగలేదు. అతుడు గృహస్థుడనుకొందురు, కాని నిజమున కతడే బ్రహ్మచారి. బ్రహ్మ సహితము గుర్తింపలేని ప్రవర్తనము గలవాడు శ్రీకృష్ణుడు.

## 46. పీతవాసః

పసుపుపచ్చని బట్టలు ధరించువాడు అని అర్థము. పసుపు వర్ణము శుభప్రదము. పసుపును మంగళప్రదముగ వాడుచు నుందుము. కారణము దాని పవిత్రతయే. పవిత్రతకు కారణము అందు దైవము మిక్కుటముగ స్థితిగొని యుండుటయే. పుణ్యకార్యములకు పట్టుబట్టలు ధరించుట, పసుపు బట్టలు ధరించుట అను సంప్రదాయము ఈ అవగాహన నుండియే ఏర్పడినది. శ్రీకృష్ణుడెప్పుడునూ పసుపుబట్టలే ధరించెడివాడు. పసుపు లక్ష్మీచిహ్నము. అతడు లక్ష్మీ నివాసుడు. అనగా లక్ష్మీ రూపముగ ప్రకటింపబడువాడు. భగవంతు డగుపడుట యనగా బంగారు కాంతితో గోచరించుటయే. అవ్యక్తుడుగ అతడు ముదురు నీలము, చీకటివంటివాడు. కావుననే కృష్ణుడు. వ్యక్తుడుగా అతడు బంగారుచాయ. అదియే విఠలుడు.

మనలోని దివ్యశరీరము కూడ బంగారు చాయయే కలిగి

యుండును. బుద్ధిలోకములలోనికి ఎదిగినవారికి ఈ శరీర అనుభవము కలుగును. ఈ శరీరమునకు మరణము లేదు. శ్రీకృష్ణుడు బుద్ధియే శరీరముగ కలవాడు. మరణ మతని సమీపమునకు కూడ రాలేదు. అతని పీతాంబరమున కట్టి మహిమ కలదు.

## 47. పారిజాతాపహారకః

పారిజాత వృక్షము నపహరించినవాడు.

ఇంద్రుని తల్లి ప్రార్థనపై ఇంద్రుని రక్షించుటకు, ఇంద్రపదవి యందు పునఃప్రతిష్ఠించుటకు శ్రీకృష్ణుడు నరకుని సంహరించెను. స్వర్గమున ఇంద్రునకు పట్టము గట్టెను. అటుపైన సత్యభామను సంతోషపెట్టుటకై స్వర్గమునకేగి పారిజాత వృక్షమును కొని వచ్చుటకై ప్రయత్నింపగ ఇంద్రుడు అడ్డుపడి యుద్ధము చేసెను. యుద్ధమున ఇంద్రుడు ఓడిపోయెను. ఇంద్రుని తల్లి ఇంద్రుని అజ్ఞానమునకు అతనిని మందలించెను. నిజము నకు నరకుని జయించిన పిదప స్వర్గమును పొందినది సత్యభామా కృష్ణులే. స్వర్గము వారి విజయఫలము. అది వారి సొత్తు. అందున్న పారిజాత వృక్షము కూడ వారి సొత్తే. వారు ఏర్పరచిన ప్రతినిధియే ఇంద్రుడు. ప్రతినిధి యజ మానిని ధిక్కరించుట అజ్ఞానము. ఇంద్రుని అజ్ఞాన మట్టిది.

పదవులలో నున్నవారికి అజ్ఞానమను గ్రుడ్డితన మేర్పడుచున్నది. చిన్న పదవి నుండి పెద్దపదవి వరకు అందున్నవారు అధికారమును చూపుదురు కాని, పదవి తమ కందింపబడిన బాధ్యత అని ఎరుగరు. అధికారము అహంకారమును కలిగించును. అహంకారము పతనమునకు కారణ మగును. అధికార మొక పవిత్రమగు బాధ్యత అని తెలిసినపుడే అది సక్రమముగ నిర్వర్తింపబడును. ఇంద్రుని అహంకారమును తొలగించుటకే శ్రీకృష్ణుడు పారిజాత అపహరణ చమత్కారమును గావించెను.

## 48. గోవర్ధనో అచలోద్ధర్తా

గోవర్ధనమును కొండనెత్తి గోవులను, గోపబాలకులను కాచిన వాడు శ్రీకృష్ణుడు.

తనను నమ్మినవారిని, తనను ఆశ్రయించినవారిని ఎటువంటి కష్టము నుండైనను రక్షింతునని శ్రీకృష్ణుడు చూపిన లీల యిది. చిటికిన వ్రేలిపై గోవర్ధన పర్వతమును గొడుగువలె నిలిపి గోపగోపీ జనములను, గోవులను ఇంద్రుని కోపమునుండి రక్షించెను. కొండనెత్తి చిటికిన వ్రేలిపై వుంచినపుడు దాని క్రిందకు చేరుటకు పరిపూర్ణ విశ్వాసము ఆవశ్యకము. ఎత్తబడిన కొండ క్రింద నిలబడుట చాల భయమును కలిగించును. కొండ ఎప్పుడైనను మీద పడవచ్చును. ఎత్తినవాడు బాలుడు, నిలిపినది అతని సుకుమారమగు చిటికిన వ్రేలుపైన. తెలివిగల వాడెవ్వడునూ దాని క్రిందకు చేరడు. తెలివి రక్షించదని దైవమే రక్షించునని తెలిసినవారే అచట చేరగలరు.

శ్రీకృష్ణుని ఈ లీల ఒకవైపు తనను ఆశ్రయించినవారికి అగ్ని పరీక్ష వంటిది. మరియొకవైపు ఇంద్రునికి గర్వభంగము.

ఇంద్రుడు కోపించి రాళ్ళ వర్షము కురిపించెను. అతడు కోపించుట అతని అజ్ఞానము. అతడు పూజింపబడుట కలవాటు పడెను. తానే వర్షము నిచ్చువాడ ననుకొనెను. ఇచ్చువాడు తాను కాదని మరచెను. జీవుల పుణ్యాచరణ మునే వర్షము రూపమున తానందించ గలడు కాని తాను ప్రత్యేకముగ వర్షము నందించలేడు. ఈ సత్యమును శ్రీకృష్ణుడు నందునికి తెలిపి, సత్కర్మాచరణమునకు ప్రేరణ నిచ్చెను. సత్కర్మాచరణ యున్నచోట సమృద్ధి యుండునని, సకాల వర్షములు కలిగి పాడి పంట వృద్ధి చెందునని, సత్కర్మాచరణమే ప్రధానమని, అట్లాచరించినచో వర్షములు పడుట తప్పదని తెలిపెను. గోవులను, గోపగోపీ జనులను హృదయముతో సంరక్షించుచు పరిపాలించుట ఇంద్రుని పూజించుట కన్న శ్రేష్ఠమని తెలిపెను. ఆవుపాలు దూడలు త్రాగిన పిదప మిగిలినవే మానవులు త్రాగవలెనని అపుడు

గోవులు సంతోషించునని, గోవులు సంతోషించిన దైవము సంతోషించునని తెలిపెను. అట్లే పశువులకు మేత సమృద్ధిగ నందించవలెనని, సూర్యుని వేడిమినుండి వాటిని కాపాడవలె నని, ఎద్దులచే ఉదయముననే పొలములు దున్నించుట చేయవలెనని మండుటెండలో చేయించరాదని తెలిపెను. అదే విధముగ నాయకుడుగ శ్రమజీవుల కష్టమును గుర్తించి తగువిధముగ వారికి సేవ, సౌకర్యములు కలుగచేయవలెనని తెలిపెను. క్లుప్తముగ, యజ్ఞార్థ జీవనము సమృద్ధి కలి గించును కాని కేవలము దేవతా పూజలు కలిగింపవు అని తెలిపెను. ఇది శాశ్వత సత్యము. ఈ సత్యము తెలియని ఇంద్రునికి మరల పరాభవము కలిగించెను.

సృష్టియందు ఎవ్వరునూ కర్తకాదు, కర్మఫలమే కర్త. కర్మకు ప్రేరణము సంకల్పము. సంకల్పము దైవమునుండి వచ్చును. కావున దైవమే కర్త. 'న అహం కర్త, హరిః శ్రీహరిః కర్త' అనునది సూక్తి.

## 49. గోపాలః

గోవులను పాలించువాడు, గోవులకు ప్రభువు అని అర్థము. శ్రీకృష్ణుడు గోవులను కాచుట, రక్షించుట జగద్విదితమే. అసురుల బారి నుండి గోవులను రక్షించును. బ్రహ్మ, ఇంద్రాది దేవతల నుండి కూడ గోవులను రక్షించును.

గోవులనగా ఆవులని సామాన్య అర్థము. శ్రీకృష్ణుడు వానిని రక్షించుట తెలిసిన విషయమే. గోవులనగా సాధు జనులని కూడ అర్థము. సృష్టియందలి సాధుజనులను రక్షించుటే తన కర్తవ్యముగ నిలచిన జగత్ప్రభువు శ్రీకృష్ణుడు. అతడు సాధుజనుల హింస సహింపడు. అది గోహింస వంటిది.

గోవులనగ కిరణములని కూడ అర్థము. కిరణముల రూపమున సూర్యచంద్రుల నుండి ప్రకాశించు ప్రజ్ఞ సూర్య చంద్రాత్మక ప్రజ్ఞ. అట్టి ప్రజ్ఞకు మూలము తానే అయివున్న

శ్రీకృష్ణుడు కిరణపాలకుడు కావున గోపాలకుడు. కిరణముల నుండి జీవులను సృష్టిలోనికి ప్రవేశింపజేయుట ప్రజ్ఞామయు లైన జీవులకు స్థూల, సూక్ష్మకారణ ప్రాణముల నొసగుట దైవమే చేయుచున్నాడు. జీవుని ప్రజ్ఞ, ప్రాణస్పందనము దైవమిచ్చినవే. గోవులనగా యింద్రియములని కూడ అర్థ మున్నది. ఇంద్రియముల రూపమున జీవులకు దైవము మధురానుభూతిని ప్రపంచమున కలిగించుచు నున్నాడు. అనిరుద్ధుడిగా ఇంద్రియములను పరిపాలించుట శ్రీకృష్ణుని నాలుగవ వ్యూహము.

గోవులనగా స్రవించు గ్రంథులని కూడ అర్థము. మానవ శరీరములోని షడ్గ్రంథులకు షట్చక్రము లాధారములై యున్నవి. అవి పద్మములుగ వికసించినపుడు గ్రంథులు పరిపూర్ణముగ స్రవించును. అట్లు స్రవించుట వలన జీవుడు భౌతికముగ నుండియే పరమపదము వరకు గల అన్ని లోకముల అనుభూతి పొందగలడు.

శ్రీకృష్ణుని గోపాల తత్త్వము అనిర్వచనీయము. గోవులనగా గ్రహములని కూడ అర్థమున్నది. ఇట్లు వివరించుకొన్నచో సృష్టి యందలి సమస్త వ్యాపారము పరిపాలించువాడు గోపాలకుడు. అతడే శ్రీకృష్ణుడని తెలియవలెను.

## 50. సర్వపాలకః

పై వివరణము గ్రహించినచో సమస్తమునకు పాలకుడు శ్రీకృష్ణుడే అని తెలియును. దేవతలకు, దానవులకు, మానవులకు, జంతువులకు, గ్రహ-గోళాదులకు, సమస్తమునకు నేనే ప్రభువును, నేనే మూలమును, నేను లేని దేమియు లేదు. అన్నిట అంతట నిండియున్నది నేనే అనుచూ అర్జునునికి తనను తానే గీతరూపమున ప్రకటించుకొనినాడు. జ్ఞానమునకు, అజ్ఞానమునకు కూడ అతడే ప్రభువు. పాప పుణ్యములకు, మాయకు కూడ నేనే ప్రభువునని తెలిపిన సమగ్ర దివ్యమూర్తి శ్రీకృష్ణ పరబ్రహ్మమే.

## 51. అజో

అజు డనగా పుట్టనివాడు అని అర్థము. పుట్టుట అనగా స్థితి బేధము కలుగుట. శాశ్వత స్థితి సత్యస్థితి. సత్యమే అవస్థితులు చెంది ఏడు లోకములుగ నేర్పడు చున్నవి. అవియే తపోలోకము, జనోలోకము, మహర్లోకము, సువర్లోకము, భువర్లోకము, భూలోకము, సత్యలోకముతో కలిపి మొత్తము ఏడు లోకములు. సత్యమే ఏడు లోకముల పైన ఆనందముగను చైతన్యముగను నున్నది. ఇన్ని స్థితు లకు సత్యమాధారమై యున్నది. "పూసల యందలి దారమువలె నే నున్నాను" అని శ్రీకృష్ణుడు తెలిపినాడు. (*"సూత్రే మణిగణ ఇవ"*)

భగవంతునకు పుట్టుక లేదు. కావున మరణము కూడ లేదు. అవస్థితి చెందుట కూడ లేదు. శ్రీకృష్ణుడు దేహము ధరించినను తన నిజస్థితిని ఎప్పుడునూ మరువనివాడు.

అందరి యందును అంతర్యామిగ నున్నవాడు. తనయందు, పరిసరముల యందు కలుగుచున్న స్థితిబేధము లన్నియూ తన నుండి వ్యక్తమైన గుణముల వ్యాపారమని తెలిసి జీవించినవాడు.

## 52. నిరంజనుడు

పవిత్రుడు, మచ్చలేనివాడు అని అర్థము. శ్రీకృష్ణుడు పరిపూర్ణ పురుషుడు, పురాణ పురుషుడు. అతని ప్రవర్తన మున ఎట్టి మచ్చయును లేదు. మచ్చలేని పూర్ణచంద్రుని వంటి వాడు. అతడు ఏ గుణములు అంటనివాడు. తమస్సు, రజస్సు, సత్త్వగుణములు అతని చైతన్యము నుండి పుట్టినవి. చైతన్యము కూడ అతని ఆధారముగ వెలుగుచున్నవి. నామమునకు, రూపమునకు, నిర్వచనమునకు, లక్షణము లకు (గుణములకు), తర్కమునకు, జ్ఞానమునకు, కాలము నకు కూడ అతీతుడైనవాడు. ప్రకృతికాని, కాలముకాని, అగ్ని కాని, సంకల్పముకాని, మాయగాని, అతనిని బంధింప లేవు. ఈ ఐదును అతని నుండి పుట్టినవే. అత డన్నిటి యందును వశించి యున్నను, వాటి ప్రభావ మతనిపై యుండదు. అతని సాన్నిధ్యము వలన అవి అన్నియు వాటి వాటి ప్రత్యేక గుణములను ప్రకటించుచున్నవి. సృష్టి

అంతయు నిండియున్నను ఏమియు అంటని వాడగుటచే నిరంజనుడని కీర్తింపబడుచున్నాడు. పరమేశ్వరుని నిరంజనుడని అందురు.

## 53. కామ జనకః

మన్మథుని తండ్రి. మన్మథుడు శ్రీ మహావిష్ణువుకు, లక్ష్మీదేవికి కలిగిన పుత్రుడు. సృష్టి యందలి కోరిక. మన్మథుని కారణముగనే కోరికలు కలుగును. కోరిక లేనిదే అనుభూతి లేదు. కోరికలు సుఖానుభూతి, దుఃఖాను భూతిని కూడ నీయగలవు. జీవుల యందలి సంకల్పశక్తి లేక ఇచ్ఛాశక్తి కూడ కోరికయే. సంకల్పమే లేనిచో సృష్టియే లేదు. సృష్టియందు కూడ కోరికయే ప్రధానముగ జీవులు చరించు చుందురు. ధర్మబద్ధమైన కోరికలు అనుభూతిని, ఆనందమును యిచ్చును. ధర్మబద్ధము కానివి దుఃఖము నిచ్చును. దేవతలు ధర్మబద్ధులు. అసురులు అధర్మ బద్ధులు. ఇరువురును ఒకే తండ్రి నుండి పుట్టినవారు శ్రీకృష్ణుని నుండి శ్రీమహావిష్ణువు, శ్రీలక్ష్మి జనించిరి అని పురాణములు తెలియజేయుచున్నవి. మహావిష్ణువు బొడ్డునుండి చతుర్ముఖ బ్రహ్మ జన్మించినాడు. అతని

నుండి ప్రజాపతులు జన్మించిరి. అందు కశ్యప ప్రజాపతి నుండి సురలు, అసురులు జన్మించిరి. ఇట్లు కృష్ణుని నుండి పుట్టిన సంకల్పము సృష్టి నిర్మాణము చేయు కోరికగ వృద్ధి చెందినది. ఈ సంకల్పము సృష్టికే కారణము. దానికి మూలము శ్రీకృష్ణుడు. తన నుండి కోరిక ఉద్భవింపగ కోరికకు సహకరించిన వాడగుటచేత వేదములు శ్రీకృష్ణుని "సోకామయత" అని కీర్తించు చున్నవి. కోరికల యందు బంధింపబడ్డవారు కృష్ణ స్మరణ గావించినచో బంధఛేదనము కలుగును. స్మరణ గావించుటకు కూడ కోరిక (సంకల్పము) కలుగవలెను కదా! అది ఇచ్చువాడు కూడ కృష్ణుడే. మోక్షము నిచ్చిన అతడే ఈయవలెను. ఇహసుఖ మిచ్చినను పరసుఖ మిచ్చినను అంతయూ అతని సంకల్పమే.

## 54. కంజలోచనః

నల్ల కలువరేకులవంటి కనులు కలవాడు అని అర్థము. నలుపు తెలియని లోతులకు చిహ్నము. కృష్ణుని కన్నుల లోనికి చూచువారు అతని లోతులు తెలియలేరు. వాని లోతులు నారదాది మునీంద్రులకే తెలియలేదు. అతని చూపులలోని లోతులు అందరిని ఆకర్షితులను చేసినవి. మోహితులను చేసినవి. రక్షణ నిచ్చినవి. మోక్షమును కూడ నిచ్చినవి. అవి ఎంత లోతైనవో అంత కాంతివంతములు. భారత సంగ్రామమున అతని చూపులే శత్రువులను అతనిలోని కాకర్షించినవి. రుక్మిణిని పరిహరించినపుడు కూడ శత్రువుల నందరిని ముహూర్తకాలము నిశ్చేష్ట పరచినవి. కురు సభలో సుయోధనునితో సహా అందరిని ఉత్తిష్ఠతులను గావించినవి. ఆ కన్నులు ఋషులను సైతము మోహ పరవశులను గావించినవి. గోవులు, గోవత్సములు, గోపగోపీ జనులు, భక్తులు, యోగీంద్రులు,

మునులు, మహర్షులు కూడ తన్మయత్వము చెందిన లోచనము లతనివి. వానిని వర్ణింప శక్యము కాదు. అమిత ఆకర్షణీయములు.

ఆ కన్నులు ఎంత లోతైనవో అంత దూరము కూడ చూడగలవు. లోకము లన్నింటినీ చూడగలవు. అట్లు చూచియే పరలోకముల యందున్న గురుపుత్రుని గుర్తించి గురువునకు దక్షిణగ తెచ్చియిచ్చినవి. ఆ కన్నులే బ్రాహ్మణ పుత్రులను కూడ పరలోకముల నుండి గొనివచ్చినవి. ఆ కన్నులే అత్యంత దూరము నుండి కిరణములను ప్రసరించుచు ద్రౌపది మాన రక్షణమును గావించినవి. కృష్ణుని కన్నుల నారాధించువారు తన్మయత్వము చెందగలరు.

## 55. మధుహా

మధు అను రాక్షసుని చంపినవాడని అర్థము. మధు సూదను డన్నను అదే అర్థము. మధుకైటభులను రాక్షసులు సృష్టి ప్రారంభమున అహంకరించి విష్ణునితో పోరాడి గెలిచిన వారు. వరప్రసాదులై అహంకరించినవారు. వారిని శ్రీ మహావిష్ణువు యుక్తితో సంహరించెను. మధుకైటభులు శ్రీ మహావిష్ణువు తొడలోనుండి పుట్టినవారు. మహాబలవంతులు వారు. అహంకారమున కన్ను మిన్ను గానలేక శ్రీ మహా విష్ణువునే వరమిచ్చి అనుగ్రహించదలచిరి. వారు అహంకా రమునకు ప్రతీకలు. అహంకారులను యుక్తితో చంపుట శ్రీ మహావిష్ణువు చూపిన మార్గము. భస్మాసురుని, హిరణ్య కశిపుని, వాలిని, జరాసంధుని, కాలయవనుని, నరకుని దైవము యుక్తితోనే సంహరించెను. అహంకారమంత రించుటకే దైవమును మధుసూదన నామముతో కొలతురు. కేశవ నామములలో కూడ ఈ నామము చేర్చబడినది.

## 56. మధురా నాథః

శ్రీకృష్ణుడు మధురత్వమునకు నాయకుడు. మధురా నగరమునకు కూడ అతనే నిజమైన నాయకుడు. ఉగ్ర సేనుడు అతని ప్రతినిధి మాత్రమే. కృష్ణుని మధురత్వము తన్మయత్వ మును కలిగించును. అతనిని మధురాధిపతిగ ఆదిశంకరులు అష్టక రూపమున కీర్తించిరి. అంతకు మించి కృష్ణుని మధురత్వము నెవ్వరునూ తెలుపజాలరు. శ్రీకృష్ణుని మూర్తి మొత్తము మధురమే. అంగాంగము లన్నియూ మధురములే. మధురభక్తి వివిధభక్తులలో ఉత్తమమైనది. తన్మయత్వము కలిగించి జీవులను ప్రత్యగాత్మ స్థితినుండి కూడ వుద్ధరించి విశ్వమయము చేయును. కృష్ణభక్తులకు విశ్వమంతయు కృష్ణునిగ గోచరించి తన్మయత్వము నిచ్చును. దైవమునందు మిక్కిలి ప్రేమ, అనురాగము నిష్కారణముగ కలిగినవారికి ఈ అనుభూతి అనుగ్రహింప బడును. గోపికల మధురభక్తిని చూచి దేవర్షి నారదుడు

సహితము అచ్చెరు వందెను. హనుమంతుని భక్తిని గమ నించినపుడు కూడ నారద మహర్షికి విస్మయమే దక్కినది. తాను దైవమునకు పరమ భక్తుడయ్యు, కృష్ణభక్తులను చూచినపుడెల్ల నారదమహర్షి వులిక్కిపడుచుండును. మధురభక్తి అనిర్వచనీయము. అది అనుభవైక జ్ఞానము.

## 57. ద్వారకా నాయకః

శ్రీకృష్ణుడు నవద్వార పురి ద్వారకను నిర్మించెను. అందు యాదవులకు రక్షణ నొసగెను. జరాసంధుని దండయాత్ర లకు భయపడిన యాదవుల కొరకై దైవ శిల్పియగు విశ్వ కర్మను ఆవాహనము గావించి తొమ్మిది ప్రాకారములతో ఛేదింపలేని ద్వారకను నిర్మాణము గావించి యాదవుల నందరిని ద్వారకాపురమునకు తరలించెను. పేరునకు యాదవరాజు ఉగ్రసేనుడు. నిజమునకు నాయకుడు శ్రీకృష్ణుడే.

మానవ శరీరము కూడ ద్వారక వంటిదే. ద్వారకయందు శ్రీకృష్ణుడున్నట్లు మనయందును శ్రీకృష్ణుడున్నాడు. సంకర్షణుడగు బలరాముడు ప్రతీకగ మనమున్నాము. అహంకార స్వరూపులమై యున్నాము. మనయందలి బుద్ధి రూపమున ప్రద్యుమ్నుడున్నాడు. అతను కృష్ణుని

కుమారుడు. అనగ మనయందలి బుద్ధి కూడ దైవమునదే. దైవమును స్మరించినపుడు మాత్రమే ప్రద్యుమ్న రూపమున బుద్ధి వికసించును. ద్వారకయందు ప్రద్యుమ్న కుమారుడగు అనిరుద్ధుడున్నాడు. అట్లే మనయందు మనస్సు రూపమున, ఇంద్రియముల రూపమున తిరుగు లేక ప్రకాశించు ప్రజ్ఞ యున్నది. కృష్ణ ప్రద్యుమ్నుల నుండి అనిరుద్ధ ప్రకాశము జరుగును. మన మహంకరించినపుడెల్ల కృష్ణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు అదృశ్యులై మిన్నకుందురు. కృష్ణుని స్మరించి నపుడెల్ల బలరాముడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు ఒకరితో నొకరు సహకరించునట్లుగా అహంకారము, బుద్ధి, చిత్తమునకు సహకరించును. దైవమును విస్మరించి మనము చేయు భావము, భాష, చేత, మనయందున్న మూర్ఖులగు యాదవులే. కృష్ణుని నమ్మని యాదవులు చివరకు నశించిరి. ఇట్లు కృష్ణ సామ్రాజ్యమంతయు మన శరీరమున నున్నది. కృష్ణుని అష్టభార్యలుగ మనలో అష్టప్రకృతు లున్నవి. అవియే

పంచేంద్రియములు, త్రిగుణములు. అతని పదహారు వేలమంది భార్యలుగ మనలో 16 వేల ప్రజ్ఞాకేంద్రము లున్నవి. ద్వారకకు తొమ్మిది ద్వారములున్నట్లుగ మన యందు కూడ నవ రంధ్రము లున్నవి. ద్వారక సర్వ ప్రజ్ఞలతో కూడిన మానవ శరీరము. దానికి నాధుడు శ్రీకృష్ణుడే. అతని అనుగ్రహముననే మనమీ శరీరమున నున్నాము.

## 58. బలీ

సృష్టి బలము శ్రీకృష్ణుడు. దేవతల యందైనను, దానవుల యందైనను, మానవుల యందైనను, సర్వప్రాణికోటి యందైనను బలము దైవమే. అతని అస్థిత్వమున జీవులకు బలము కలుగును. అతడు అస్థిత్వము ఉపసంహరించినచో ప్రాణులకు బలమే లేదు. మూలబలము, ప్రాణబలము, సర్వబలము శ్రీకృష్ణుడే. "సకల బలంబులు నీవే సర్వేశ్వరా" అని అన్నమయ్య కీర్తించినాడు. కొంద రాత్మబలమని ఆత్మవిశ్వాసమని అనుచుందురు. అదియునూ దైవమే. బలము దైవముయొక్క మరియొక పేరు.

## 59. బృందావనాన్త సంచారి

బృందావనము లోపల సంచరించువాడు శ్రీకృష్ణుడని అర్థము. బృందావనము సురక్షిత ప్రదేశము. వ్రేపల్లె యందు కలుగుచున్న అరిష్టముల నుండి గోప గోపీజనములను రక్షించుటకు నందుడు బృందావనమునకు పోయెను. బృందావనమున శ్రీకృష్ణు డనేకానేక దివ్యలీలలను ప్రదర్శించెను. దివ్యానుభూతిని కలిగించెను. దివ్య సాన్నిధ్య మున గోపగోపీ జనులను నిలిపెను.

బృందావనము జీవుల హృదయమునందు కూడ యున్నది. దైవప్రార్థన, ధ్యానముల ద్వారా అంతర్గతుడై హృదయమున మధురానుభూతి పొందు సద్భక్తులకు బృందావన మవగతమగును. హృదయమున మధురాను భూతిని పొందుట, తదనుభూతి యందు జీవితమును గడుపుట అట్టివారికి సాధ్యమగును. అట్టి భక్తులు బృందములు బృందములుగ నాగరికతకు దూరముగ జీవించుట నేటికిని గోచరించును.

## 60. తులసీదామ భూషణః

తులసీదళముల మాలచే అలంకరింపబడువాడు శ్రీకృష్ణుడు.

తులసి పవిత్రతకు చిహ్నము. పవిత్రతను కలిగించగల శక్తి తులసీ దళమున కున్నది. రక్తశుద్ధికి కూడ ఇది ఔషధ ముగ పనిచేయును. పవిత్రీకరించగల తత్త్వముగలది, పవిత్ర మైనది, తులసీదళ మగుటచే శ్రీకృష్ణుడు తులసీ దళము లను ప్రత్యేకముగ ధరించును.

పవిత్రీకరించగల, పవిత్రులగు మహాత్ములను కూడ దైవము తనకు అలంకారముగ ధరించును. సనకసనంద నాదులు, మైత్రేయాదులు పరమభక్తులు. దేవునికి అలంకార ముల వంటివారు. వారిని కూడ దైవము ధరించును. అనగా అనుగ్రహించి వారియందు వసించును.

తులసి పవిత్రతా ధర్మముగల ఒక పుణ్యమూర్తి. విష్ణు

మూర్తిచే అనుగ్రహింపబడినది. శ్రీ మహావిష్ణువు సాన్నిధ్యము తులసి నుండి లభించునని మహావిష్ణువే వర మిచ్చినాడు. శ్రీకృష్ణుడుగ దిగివచ్చినప్పుడు స్వయముగా తానే ధరించినాడు.

## 61. శమంతక మణేర్హర్త

శమంతక మణిని అపహరించినవాడు అని అర్థము.

శ్రీకృష్ణునికి శమంతక మణి నపహరించినవాడుగ అపవాదు కలిగెను. ఆ అపవాదును తొలగించుకొనుటకై చేసిన ప్రయత్నమున జాంబవతిని, సత్యభామను పొందెను.

## 62. నరనారాయణాత్మకః

నారాయణుడే నరులరూపమున కూడ వసించు చుండును. నారాయణుడు సృష్టికి మూలము. నారములనగా నశించనివి అని అర్థము. నర అనగా నశించని జీవతత్త్వము. అందుండువాడు నారాయణుడు. దైవమే జీవులయందు ఆత్మ తత్త్వముగ నున్నాడు. నరుడు నారాయణుడు కూడ తత్త్వపరముగ ఒకటే స్థితి భేదమున దేవుడు జీవుడు అగుచున్నారు. సముద్రమే అలగా మారినపుడు అల యందున్నది సముద్రమే కదా! అట్లే నారాయణుడే నరుడగు చున్నాడు. అల రూపము శాశ్వతము కాదు. కాని అల రూపమున నున్న నీరు అల లేనపుడు కూడ నుండును. సముద్రము అలగ స్థితిభేదము చెందుచుండగ అల వేరుగ నున్నట్లు గోచరించును. నిజమున కందున్నది సముద్రమే కదా! అట్లే నరుని రూపమున నున్నది నారాయణుడే. నరుని ఆత్మ నారాయణుడే. నరుడుగను నారాయణుడుగను

వున్నవాడొక్కడే. మాయావరణమును పరిపూర్ణముగ దాటిన వానికే ఈ సత్యము గోచరింపగలదు. అట్టివారిని పరమ భక్తులందురు. వారికి బ్రాహ్మణుడు, శూద్రుడు, చండాలుడు కూడ దేవుని రూపములే. రామకృష్ణ పరమహంస, షిరిడి సాయి ఈ తత్త్వమును ప్రదర్శించినారు.

## 63. కుబ్జా కృష్ణాంబరధరా

అజ్ఞానమను వస్త్రము (పొర)చే ఆవరింపబడిన కుబ్జను అనుగ్రహించినవాడు శ్రీకృష్ణుడు. కుబ్జకు శ్రీకృష్ణుడు మొదటగ సౌందర్యము ననుగ్రహించెను. కుబ్జ శ్రీకృష్ణుని కామమునకై కోరినది. అప్పుడు శ్రీకృష్ణుడు బాలుడు. పదకొండు సంవత్సరముల వయస్సు కలవాడు. అట్టి బాలుని కామమునకై కోరుట కురుచదనము. అందుచే ఆమె రూపమున సౌందర్యము పొందినను స్వభావమున కుబ్జత్వము వుండిపోయినది. కుబ్జ అనగా పొట్టిది అని, పెరగనిది అని అర్థము. బుద్ధియందు పెరగని కుబ్జ కామమును ఆమె ధరించిన నల్లని వస్త్రముగ ఈ నామము తెలుపుచున్నది. తనను కోరినవారిని, స్మరించినవారిని అనుగ్రహించు శ్రీకృష్ణుడు కుబ్జను కూడ అనుగ్రహించి ఉద్ధరించినాడు. ఆమె కోరిన పాకృత స్పర్శకాక అప్రాకృత (దివ్య) స్పర్శనిచ్చి అనుగ్రహించినవాడు శ్రీకృష్ణుడు. తనను కామించినవారిని కూడ మోక్షస్థితి యందు నిలబెట్టిన పూర్ణ పురుషుడు శ్రీకృష్ణుడు.

## 64, 65. మాయీ, పరమపురుషః

శ్రీకృష్ణుడు పరమ పురుషుడయ్యు, ఆత్మ మాయను ధరించి అవతరించుచు నుండును. "నా మాయచే నన్ను అవతరింపజేసు కొందును." అని శ్రీకృష్ణుడు భగవద్గీత యందు పలికినాడు. నిజముగ మాయ వలననే సకల సృష్టి నిర్మాణము జరుగుచున్నది. మాయ వలననే వివిధత్వము గోచరించుచున్నది. మాయ లేనిచో వివిధత్వము లేదు. నీరు ఒకటే అయినను వేడిమి వలన ఆవిరి యగుట, చల్లదనము వలన మంచు గడ్డయగుట, ఆవిరి - నీరు- మంచుగడ్డ వేరు వేరుగ గోచరించుట మాయ కారణముగనే జరుగుచున్నది. సృష్టి కార్యమునకు మాయ ప్రధానమగు పనిముట్టు. అది కృష్ణుని ఆశ్రయించి యుండును. కావుననే కృష్ణుని 'మాయీ' అని పిలుతురు. అనగా మాయను ధరించినవాడని అర్థము. మాయను అవిద్య అని కూడ పిలుతురు.

## 66. ముష్టికాసుర చాణూర మల్లయుద్ధ విశారదః

చాణూర ముష్టికులను మల్లయుద్ధమున గెలిచినవాడు అని అర్థము.

## 67, 68, 69.

## సంసారవైరీ కంసారి ర్మురారి ర్నరకాంతకః

సంసార మనగా పంచభూత సృష్టి. దానిని కలవర పరచువారు సంసారవైరులు. ప్రపంచ విరోధులైన కంసుడు, మురాసురుడు, నరకాసురులను సంహరించినవాడు.

కంసుడు అహంకార స్వరూపుడు, ఆత్మహంతకుడు అది కారణముగ జీవుడు దుఃఖము పొందుచుండును. మురా సురుడు మమకారము, మోహము స్వరూపము. అట్టి జీవునకు దుఃఖము తప్పదు. నరకాసురుడు అజ్ఞాన స్వరూపము. దాని వలనను జీవునకు దుఃఖమే కలుగును. అజ్ఞానము, మోహము, అహంకారము- ఇట్టి స్వభావములను జీవులలో సంహరించి జీవుల నుద్ధరించువాడు శ్రీకృష్ణుడు. అంతఃకరణ చతుష్టయమును ఆవరించిన అజ్ఞానము దైవ ప్రార్థనలతో క్రమముగ తొలగిపోవును. అంతవరకు జీవాత్మకు శాంతి

లేదు. అసురులందరు వివిధమగు అజ్ఞాన భావములే. దేవతలు వివిధములగు విజ్ఞాన భావములు. జీవులయందు జ్ఞాన అజ్ఞాన భావములు మిళితములై ఘర్షణ జరుగు చుండును. అదియే దేవాసుర సంగ్రామము. దైవము అవత రించినపుడెల్ల మరల సమత్వము, శాంతి నెలకొనును. అందులకే దైవ ప్రార్థన.

## 70. అనాది బ్రహ్మచారి

శ్రీకృష్ణుడు శాశ్వతమగు బ్రహ్మచారి. అనగా ఎల్లప్పుడు బ్రహ్మము నందే చరించును. అతని చుట్టును అనేకానేక స్త్రీలు పరివేష్టితులై వున్నప్పటికిని కామదృష్టి లేనివాడు శ్రీకృష్ణుడు. తన భార్యలు సంతానము కోరినప్పుడు మాత్రమే తదనుగుణమగు కక్ష్యలోనికి ప్రవేశించి సంతానము నిచ్చినవాడే కాని సహజముగ కామము లేనివాడు. అతడు సహజ బ్రహ్మచారి. అతడు కాలమున కతీతమైన సనాతనుడు.

## 71. వ్యసన కర్షకః

విశిష్టముగ పాడిపంటలను వృద్ధి గావించినవాడు శ్రీకృష్ణుడు. అసన మనగ ఆహారము. వ్యసన మనగ విశిష్టమగు ఆహారము. కర్షకుడనగ పండింపజేయువాడు. పొలము దున్నుట, ఆహారము వృద్ధిచేయుట, పాడిపంటలను పెంపొందింపచేయుట, గ్రామములను బృందావనములుగ తీర్చిదిద్దుట, శ్రీకృష్ణుడు నిర్వర్తించిన ముఖ్యమగు కార్యము లలో నొకటి. ఈ కార్యమునకు బలరాముడు పనిముట్టుగ నిలచినాడు. అతడు హలాయుధుడై కృష్ణ సంకల్పమును నిర్వర్తించినాడు. ఉత్తర భారతమున విశిష్టముగ పంట భూములను పెంపొందించినాడు. కర్షకులుగ కూడ కృష్ణ బలరాములు చక్కని ఖ్యాతి నార్జించినారు.

శరీరమందలి సారమును యోగ సాధనము ద్వారా పెంపొందింపజేయుట, తదనుగుణమగు యోగానుభూతు లను కలిగించి ఆత్మానుభూతి యందు జీవులను స్థిర పరచుట కూడ నిర్వర్తించినవాడు శ్రీకృష్ణుడు.

## 72. శిశుపాల శిరశ్ఛేత్తా

శిశుపాలుని శిరస్సును ఛేదించిన వాడు. రాజసూయమున అహంకారుడైన శిశుపాలుని వధించినవాడు శ్రీకృష్ణుడు. తనను దూషించినను శ్రీకృష్ణుడు లెక్కచేయలేదు. తన భక్తులైన భీష్మ, ద్రోణ, ధర్మజులను తూలనాడినప్పుడు శిశుపాలుని తన సుదర్శనముచే శిరచ్ఛేదము గావించెను. కృష్ణుడు తనను దూషించిన వారికన్న తన భక్తులను దూషించిన వారిని, తన భక్తుల యెడల అన్యాయముగ ప్రవర్తించిన వారిని శిక్షించును. అతని భక్త వాత్సల్యమట్టిది.

# 73. దుర్యోధన కులాంతకః

దుర్యోధనుని, అతని సోదరులను, వారి సంతానమును సమూలముగ సంహరింపచేసినవాడు శ్రీకృష్ణుడు. కుల స్త్రీ అయిన ద్రౌపదీదేవిని రాజసభయందు దుర్యోధను డవమానించినప్పుడే అతని కులక్షయమునకు దైవము నిర్ణయము గావించెను. తదనుగుణముగనే కాలము నడచినది. కుల స్త్రీ నవమానించుట వలన తన కులము నంతను అంతరింపజేసుకొనిన మూర్ఖుడు దుర్యోధనుడు. శ్రీకృష్ణుడు తన సాన్నిధ్యము నిచ్చి పాండవులచే ధృతరాష్ట్ర సంతతి నంతటిని నిర్మూలనము గావించుట ధర్మ సంస్థాపనమున తానెట్టి అలసత్వమును చూపడని చాటి చెప్పినాడు.

## 74, 75. విదురాఽ క్రూర వరదః

విదురునకు, అక్రూరునకు వరమిచ్చినవాడు శ్రీకృష్ణుడు అని అర్థము. విదురుడు, అక్రూరుడు మహాజ్ఞానులు. వారు వేద వ్యాస మహర్షివలె కృష్ణ దర్శనము కావించినవారు కాదు. వేద వ్యాసుడు శ్రీకృష్ణుని పురాణపురుషునిగను, విశ్వరూప కుడుగను, సర్వవ్యాప్తియైన పరమాత్మగను దర్శనము చేసినాడు. భీష్ముని దర్శనము కూడ నట్టిదే. వ్యాసభీష్ములు కేవలము జ్ఞానులే కాక భక్తులు కూడను. వారు పరమ భక్తులగుటచే పరమాత్మయే పరిపూర్ణముగ రూపు కట్టుకొని కృష్ణ రూపమున తిరుగాడుచున్నాడని గమనించిరి. అక్రూర విదురులు అట్లు గమనింపలేకపోయిరి. అవతార సమాప్తికి ముందు అక్రూరునకు, సమాప్తియైన వెనుక విదురునకు తన విశ్వ వ్యాపకత్వమును అనుగ్రహించి వారిని ఉద్ధరించెను. జ్ఞానులు పరమ భక్తులగుట సముచితమని, సున్నితముగ సందేశమిచ్చెను.

## 76. విశ్వరూప ప్రదర్శకః

విశ్వరూపమును ప్రదర్శించిన ఏకైకమూర్తి శ్రీకృష్ణుడు. చిన్నతనమున తన నోటిద్వారా తల్లికి విశ్వరూపమును చూపెను. అటుపైన కురు సభయందు విశ్వరూపమును ప్రకటింప చేసెను. ఆపైన యుద్ధ ప్రారంభమున అర్జునునికి విశ్వరూప ప్రదర్శనము గావించెను. అప్పుడు సంజయుడు కూడ దర్శించెను. ధృతరాష్ట్రునికి కన్ను లిచ్చి కురు సభలో దర్శనమిచ్చెను. అయినను భీష్ముడు తక్క ఇతరుల కెవ్వరికిని కృష్ణుని విశ్వ వ్యాపకత్వము అవగాహన కాలేదు. కృష్ణుని విశ్వరూప సందర్శనము ఋషులను కూడ సంభ్రమాశ్చ ర్యమున ముంచినది. అట్టి ప్రదర్శనము మునుపెన్నడు హరి అవతారములయందు జరుగలేదు. కృష్ణుడు హరి అవతారము మాత్రమే కాదు, అతడు హరిహరాత్మకుడు, త్రిమూర్త్యాత్మ కుడు. సర్వదేవతామూర్తి. కృష్ణుని మించిన దైవము లేడు.

# 77. సత్యవాక్

సత్యవాక్యమును పలుకువాడు. శ్రీకృష్ణుని వాక్కు అపరిమితమగు చమత్కృతిగల వాక్కు. అతని వాక్కు అనేకములగు అర్థముల నిచ్చును. ఎవరెవరు ఏ ఏ స్థితులలో నుండిరో ఆయా స్థితులలో ఆ వాక్కు నవగాహన గావించు కొనిరి. బాలకృష్ణుని రూపమున కూడ అతను పలికిన పలుకులు రహస్య వేదార్థములను ప్రకటించు చుండెడిది. అతని మాట, చేత ఏడు లోకములను ఆశ్చర్యచకితులను చేసెడిది. ఆ వాక్కు అత్యంత మధురమగు వాక్కు. అతడు వాక్పతికి కూడ పతియే. చతుర్ముఖ బ్రహ్మకు కూడ అతను తండ్రి.

## 78. సత్య సంకల్పః

సత్యమే సంకల్పముగా కలవాడు. అతని సంకల్పమే సృష్టి, అతని సంకల్పమునకు తిరుగులేదు. సర్వ సంకల్పములకు అతడు మూలము. అతడాచరించిన సత్యము, సత్యము-అసత్యము అను ద్వంద్వములకు అతీతమగు సత్యము. అతని సంకల్పము నారదాదులకే బోధపడలేదు. మైత్రేయా దులు సహితము అతని సంకల్పమునకు శరణాగతులై నిలబడినారు.

## 79. సత్యభామారతో

సత్యభామ యందు మిక్కుటమగు ప్రీతి చూపించినవాడు శ్రీకృష్ణుడు. సత్యభామాదేవి భూదేవి ప్రజ్ఞ, రుక్మిణీదేవి శ్రీదేవి ప్రజ్ఞ. భూదేవి ప్రార్థనల నంగీకరించి భూదేవితో నుండుటకై దిగివచ్చిన పరమాత్మ శ్రీకృష్ణుడు. భూదేవి కష్టములను తీర్చి, ధర్మము స్థిరపరచి నిర్దిష్టమగు యోగమార్గమును భూమి జీవులకు అందించిన వాడు. భూదేవిని మన్నించుటకే అతను దిగి వచ్చినవాడు. శ్రీదేవికూడ తన వెంట వచ్చినది. అయినను తాను దిగివచ్చిన ప్రయోజనము భూదేవిని సంతృప్తి పరచుటకే. అది కారణముగ సత్యభామాదేవికి విశిష్టమగు స్థానమును కల్పించి, మన్నించి, గౌరవించిన సంతృప్తి గావించినాడు.

## 80. జయీ

జయము శ్రీకృష్ణుని మరియొక నామము. అతడెప్పుడునూ జయించువాడే. అపజయ మెరుగనివాడు. మహాభారత గ్రంథము అసలు నామము కూడ జయమే. యజము గావించువాడికి జయము అనునది వేదార్థము. యజమనగా యజ్ఞము. యజ్ఞమనగా పరహిత జీవనము. తన కొరకు కాక ఇతరుల శ్రేయస్సు కొరకు మాత్రమే జీవించువాడు యజ్ఞార్థ జీవనుడు. అట్లు జీవించువానికి జయము తప్పదు. నిష్కామ కర్మయోగము, సర్వారంభ పరిత్యాగము ఆచరించి చూపినవాడు శ్రీకృష్ణుడు. అత డెల్లప్పుడునూ జయుడే. అతని నాశ్రయించినవారు కూడ జయమును పొందుదురు. జయము రూపు కట్టుకొన్నచో అది శ్రీకృష్ణుడగును. జయము కాంక్షించువారు కృష్ణు నాశ్రయించుట శ్రేయస్కరము. అతడందించునది శాశ్వత జయము. అనగ పరమ పథమును చేర్చుట.

## 81. సుభద్రా పూర్వజో

సుభద్రా దేవికి ముందు పుట్టినవాడు. సుభద్ర అనగా చక్కని భద్రతయే స్వభావముగా కలది. ఆమెకన్న ముందుగ శ్రీకృష్ణుడు పుట్టినాడు అనగా శ్రీకృష్ణుడు ముందుండగ వెనుక నడచువారందరికి భద్రమే. కృష్ణునికి వెనుకయుండుట భద్రము. ముందు తానుండి యుద్ధమున అర్జునునికి భద్రము కల్పించిన వాడు శ్రీకృష్ణుడు. అట్లే యాదవులకు కూడ జరాసంధుని భయము నుండి భద్రత గూర్చెను. దైవము ముందు నడచుచుండగ వెనుక నడచుట భద్రము. మహాత్ముల విషయమున కూడ ఈ నియమము పాటించుట ఉత్తమము. తమకన్న పెద్దవారి వెనుక నడువవలెనేగాని ముందు నడువరాదు. వారాజ్ఞాపించినచో నడువ వచ్చును. దైవ భక్తుడు దైవము తనకన్న ముందు నడచుచున్నట్లు భావించవలెను. దైవము చల్లని నీడన తాము నడుచు

చున్నట్లుగ భావించవలెను. సుభద్ర దైవము వెనుక నడచు శక్తి. అందుచేత అంతయూ భద్రముగనే జరుగును. దైవభక్తు లనుకొనువారు ఈ నియమ మును పాటించుట ఉచితము.

# 82. విష్ణుః

సర్వవ్యాపకమైన దైవతత్త్వమును విష్ణువందురు. శ్రీకృష్ణుడు శ్రీమహావిష్ణువే. అతడు సర్వవ్యాపకుడు కావుననే అప్పటికప్పుడు ప్రత్యక్షమై ఆశ్రితులను రక్షించుచుండును. ద్రౌపది నట్లే రక్షించెను. అర్జునుని కూడ అట్లే రక్షించెను. తనను నమ్మినవారి నందరిని నేటికిని అట్లే రక్షించుచున్న సర్వవ్యాపి శ్రీకృష్ణుడు.

విష్ణు శబ్దమున 'వ'కార 'ష'కార 'ణ'కారములు కలవు. 'వ' అనగా జీవము లేక జలము లేక నారము. 'షు' అనగా వాయువు. 'ణ' అనగా ఆకాశము. జీవము వాయురాకాశముల రూపమున వ్యాపనము చెందినపుడు విష్ణువగును. శ్రీకృష్ణుడనగా శ్రీ మహావిష్ణువే.

## 83. భీష్మ ముక్తి ప్రదాయకః

భీష్మునికి ముక్తి ప్రసాదించినవాడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణ భక్తులలో భీష్మ పితామహుడు అగ్రగణ్యుడు. అతడు కృష్ణుడెవ్వరో తెలిసినవాడు. కావుననే రాజసూయ పరిసమాప్తి సమయమున సర్వజనులు తన కగ్రపూజ గావింప నిర్ణయింపగ, భీష్ముడు అందరికిని అగ్రగణ్యుడు, దైవ మొక్కడే అనియు, అతడే శ్రీకృష్ణుడిగ నున్నాడనియు, కావున అగ్రపూజ అతనికే జరుగవలె ననియు నిర్ణయించి నాడు. కృష్ణుడే సర్వస్వము అని తెలిసినవాడు భీష్ముడు. మరణ సమయమున కూడ కృష్ణుని అనుమతికై వేచియున్న వాడు భీష్ముడు. భీష్మునొక్కనికే మరణ సమయమున సశరీరముగ శ్రీకృష్ణుడు సాన్నిధ్యమిచ్చెను. ఇట్టి భాగ్య మెవ్వరికిని దక్కలేదు. తల్లిదండ్రులకు గాని, భార్యాపుత్రు లకు గాని, పాండవులకు గాని, గోపికలకుగాని దక్కని ఈ భాగ్యము భీష్మునొక్కనికే దక్కుటలో, భీష్ముని భక్తిప్రపత్తులు

అనన్య సామాన్యమని, నిరుపమాన మని తెలియును. వేదవ్యాసునికి సహితము నారద మహర్షి కారణముగ కృష్ణుని నిజస్వరూపము తెలిసినది. భీష్మునికి సహజముగ తెలిసినది. భీష్ముడు తనకు పరమభక్తుడు. అందులకే సాన్నిధ్యమిచ్చి ముక్తిని ప్రసాదించెను.

## 84. జగద్గురువు

జగద్గురువు శ్రీకృష్ణుడే. అతడు మూడు లోకములకు గురువు. మొత్తము సృష్టికే గురువు. కాలమునకు, ప్రకృతికి, శక్తికి, మాయకు కూడ అతడే గురువు. అతనికి ముందున్న దేమియు లేదు. అతనియందు లేనిది లేదు. అతడే ఈ మొత్తము జగత్తుగ నున్నాడు. అతని మాయ వలన జగత్తున ఇతరములు గోచరించును. అతనిని మాయ తాకలేదు. సర్వకాలముల యందు, సకల దేశములయందు (లోకము లందు), సకలజీవుల రూపముల యందు తానుగ నిండి యున్న ప్రజ్ఞ శ్రీకృష్ణుడు. సర్వమునకు గమ్యమతడే. ప్రభువతడే. సర్వమును బోధపరచువాడు కూడ నతడే. అతనిని మించిన గురువు, దైవము, ప్రభువు లేడు.

## 85. జగన్నాథః

అతడు జగన్నాథుడు. అతడనాథుడని కూడ పిలువబడు చుండును. అనగ నతనికి నాథుడు లేడు. అతడే సర్వము నకు నాథుడు. సర్వమును రక్షించువాడు, పోషించువాడు, సృష్టించువాడు, లయ మొనర్చువాడు. శ్రీకృష్ణుడే జగత్ప్రభువు.

జగద్గురువు పరంపర అంతయు శివ తత్త్వము నుండి దిగి వచ్చును. జగత్ప్రభువు పరంపర అంతయు విష్ణువు నుండి దిగి వచ్చును. శ్రీకృష్ణుడు హరిహరాత్మకుడు. అనగా గురు పరంపరకు, ప్రభు పరంపరకు కూడ మూలము. అతడు గురువుగ బోధించెను. ప్రభువుగ శిక్షించెను. ఇతర అవతారములలో రక్షణమే యున్నది. బోధన లేదు. సమస్త గురు పరంపరలలో బోధన యుండును. శిక్షించుట యుండదు. శిక్షణ రక్షణ బోధన నిర్వర్తించిన శ్రీకృష్ణుడు జగద్గురువు, జగత్ప్రభువు కూడ.

## 86. వేణునాద విశారదః

వేణువును నాదించుటలో నైపుణ్యము కలవాడు. వేణునాద మనగా శ్రీకృష్ణుని వేణునాదమే. మరియొకరు ఎవ్వరును గుర్తుకు రారు. కృష్ణుని వేణునాదము సర్వులకు మోహము కలిగించ గలదు. సర్వసమ్మోహన శక్తి అది. అతడే మోహనుడు. అతని వేణువు కూడ అతని మోహనత్వమును ప్రసరింపజేయును. అందులకే అతనిని వంశీ మోహనుడని, అతని వేణువు మోహనవంశి అని కీర్తింతురు. కృష్ణుని వేణునాదమును గూర్చి తెలుపుటెవ్వరికిని సాధ్యము కాదు. అయినను తగు మాత్రపు కృషి ఋషులు గావించినారు. అతని వేణునాదము మోక్షము నిచ్చును. పరవశత్వము కలిగించును. జీవులకు తన్మయత్వ మందించును. పంచభూతములు, పక్షులు - జంతువులు, వృక్షములు- మనుష్యులు, శత్రువులు - మిత్రులు, దేవతలు - దానవులు అందరిని కేవలము తన వేణునాదమున సమ్మోహనత్వము

కలిగించెను. సుషుమ్న మార్గమున షట్చక్రము లాధారముగ కృష్ణుని వేణునాదము వినుట ఋషు లెప్పుడును కోరుచు నుందురు.

# 87. వృషభాసుర విధ్వంసి

వృషభాసురుని విధ్యంసన చేసినవాడు. బలరామకృష్ణులు మేపుచు, కాయుచు నున్న గోవులమందలో వృషభము రూపమున అసురుడొకడు చేరెను. అతడు శ్రీకృష్ణుని చంపుటకై మాయా రూపమున మందలో తిరుగుచు నుండెను. శ్రీకృష్ణుడది గమనించి బలరామునికి తెలుపగ అతడు దానిని సంహరించెను. సాధుజనుల మధ్య తిరుగు చున్న దుష్టజనులను భగంతుడు గమనించి ఏరి వేయునని ఈ నామము తెలుపును.

## 88. బాణాసుర కరాంతకః

బాణాసురుని చేతలను నష్టమొనర్చిన వాడని అర్థము. బాణాసురుడు శివభక్తుడు. అమిత పరాక్రమము కలవాడు. పట్టుదల, మొండితనము కలవాడు. అతడు అనిరుద్ధుని చెఱబట్టెను. అది గమనించిన శ్రీకృష్ణుడు బాణాసురుని ప్రతాపమును నిర్వీర్యము గావించెను. ఎంతటి భగవద్భక్తుడైనను మొండితనము, పట్టుదల, మూర్ఖత, కలిగియున్నచో పరాజయము తప్పదని కృష్ణుని హెచ్చరిక.

# 89. యుధిష్ఠిర ప్రతిష్ఠాత్త

యుధిష్ఠిరుని కురురాజ్య సింహాసనమున సుప్రతిష్ఠుని చేసిన వాడని అర్థము. యుధిష్ఠిరుడు ధర్మపరుడు. ధర్మమే ఊపిరిగ ఓర్పు కలిగి అనేక కష్టముల నెదుర్కొనినాడు. అట్టి వానికి దైవ మెప్పుడును సాన్నిధ్యమిచ్చి రక్షించునని తెలియచెప్పుటకే శ్రీకృష్ణుడు పాండవ పక్షమున నిలచినాడు. ధర్మజుడికి సర్వ విధముల సహాయ మొనర్చి అతనిని మహాచక్రవర్తిగ స్థిరపరచినాడు. రాజసూయము, అశ్వ మేధము ఆదిగా గల క్రతువులను నిర్వర్తింపజేసి ధర్మజుని కీర్తి ప్రతిష్ఠలు దశ దిశల వ్యాప్తి గావించినాడు.

## 90. బర్హి బర్హావతంసకః

నెమలిపింఛమును అలంకారముగ శిరస్సుపై ధరించిన వాడు. కేవలము శ్రీకృష్ణుడు మాత్రమే యిట్టి అలంకార మును కలిగి యుండెను. నెమలిపింఛము సర్వవర్ణములకు సంకేతము. అందు లేని వర్ణము లేదు. వర్ణము లనగా రంగులు, శబ్దములు, అక్షరములు. ఇవి అన్నియూ తానుగనే యున్నానని ఈ అలంకారపు సంకేతము.

బర్హి అనగా అగ్ని అని కూడ అర్థము కలదు. బర్హావ తంసకు డనగా సుషుమ్నాగ్ని ప్రజ్వలితుడైనవాడు. ప్రజ్వలింప చేయువాడు. శ్రీకృష్ణుడు అగ్ని స్వరూపుడు. అతడు మన యందు సుషుమ్న మార్గమున సాన్నిధ్యమిచ్చును. సుషుమ్న యందే సర్వ వర్ణములు కలవు. అవి పరిపూర్ణముగ వికసించి నపుడు సహస్రారము సర్వ వర్ణములతో శోభిల్లుచుండును. శ్రీకృష్ణుడు సర్వ వర్ణోప శోభితుడైన సహస్రార ప్రజ్ఞ. శ్రీ

లలితను సర్వ వర్ణోపశోభిత అందురు. లలిత స్కంధములు ఏడు. వాటి మూలము శ్రీకృష్ణుడు. అది తెలుపుటకే కృష్ణుడు నెమలిపింఛమును ధరించెడివాడు. ఋషులకు మాత్రమే ఈ సందేశ మందినది.

## 91. పార్థసారథిః

అర్జునునికి రథసారథిగ పనిచేసినవాడని అర్థము. తనను శరణు పొందినవారిని తానే నడిపింతునని, అట్టివారి యోగ క్షేమములు తానే నిర్వహింతునని అర్జుని రథపగ్గములు పట్టినవాడు శ్రీకృష్ణుడు. తన నాశ్రయించినవాడు మహాపాపి యైనను వానిని సంస్కరించి, పవిత్రీకరించి ఉద్ధరింతునని శ్రీకృష్ణుడు పలికెను. అర్జునుడు కోరగ అతని రథసారథిగ నిలచి అతనికి ఆపదలు తొలగించి విజయమును కట్టబెట్టిన వాడు శ్రీకృష్ణుడు. జీవులు కోరినచో తానే సారథ్యము వహించి నడిపింతునని ఆచరణ పూర్వకమగు సందేశ మిచ్చిన దైవము శ్రీకృష్ణుడు.

## 92. అవ్యక్తః

వ్యక్తము కానివాడు. దైవము అవ్యక్తుడు. అన్నిట అంతట కూడ నిండియుండి సమస్త సృష్టిని, జీవులను నడిపించు చున్నను ఎవ్వరికిని తెలియక నుండును. శ్రీకృష్ణుడు కూడ అట్లే చరించెను. నాటికి నేటికి కూడ శ్రీకృష్ణుడు పరిపూర్ణ ముగ నెవ్వరికిని అవగాహన కాలేదు. "అవ్యక్తో వ్యక్త రూపస్య" అని భీష్ముడు శ్రీకృష్ణుని కీర్తించెను. "నీవు రూపమున తెలియబడినప్పటికిని, తెలియబడని వాడవే" అని భీష్ముడు శ్లాఘించెను. ఋషులకు, మునులకు, దేవతలకు, దానవు లకు, చతుర్ముఖ బ్రహ్మకు కూడ కృష్ణుని గూర్చి తెలియ లేదు. అతడెప్పటికిని అవ్యక్తుడే.

## 93. గీతామృత మహోదధిః

భగవద్గీతయైన అమృతమునకు సముద్రము వంటివాడు. శ్రీకృష్ణుని నుండి గానము గాలువారినది భగవద్గీత. అది అమృతముతో సమానము. అందు అమృతత్త్వమును పొందుటకు వలసిన సమస్త యోగసాధన రహస్యములున్నవి. భగవద్గీత మానవ జాతికి తలమానికమగు గ్రంథము. గీతయందులేని సాధన, చెప్పని ధర్మము, మరి యే గ్రంథము నందును లేదు. భగవద్భక్తులకు యోగసాధకులకు భగవద్గీతయే ప్రమాణము. భగవద్గీత ఉపనిషత్తుల సారము. బ్రహ్మవిద్యా మూలము. భగవద్గీతను పఠించుట, పాటించుట, ఘర్షణా రహిత జీవితమును అందించు, సమస్త బంధములను తొలగించు దివ్యసాన్నిధ్యమున స్థిరపరచును.

## 94. కాళీయ ఫణిమాణిక్య రంజిత శ్రీపదాంబుజ

కాళీయుని పడగలపై గల మాణిక్యములపైన నర్తించి రంజింపజేసిన కోమలమగు పాదములు కలవాడు శ్రీకృష్ణు డని అర్థము. శ్రీకృష్ణుడు కాళీయుని ఉద్ధరించుట ఒక మహత్తర ఘట్టము. అతని పాదములు కాళీయుని పడగలపై నృత్యము చేసినవి. కాంతివంతము, సుకుమారము అగు అతని పాదములపై పడగల మీదగల మణుల కాంతులు ప్రతిబింబించి, అతని పాదములకు మరింత శోభ చేకూరెను. పడగలపైన నర్తించుచున్న పాదములు, అభయము నిచ్చు చున్న దక్షిణ హస్తముతో కాళీయుని తోకను పట్టిన వామ హస్తము, ముఖమున చిరునవ్వు యీ నామము పఠించునపుడు స్ఫురణకు రావలెను. అట్లైనచో, శ్రీకృష్ణుని అనుగ్రహమున కాలము అనుకూలమై వర్తించును.

## 95. దామోదరః

మెడ నుండి బొడ్డు వరకును పువ్వుల దండను ధరించిన వాడు. శ్రీకృష్ణుడు ఎల్లప్పుడును పూలమాలను ధరించెడి వాడు. అది ఇంద్రుని వైజయంతి వంటిది. శ్రీకృష్ణమూర్తిని అనునిత్యము పూలమాలతోగాని, తులసిమాలతోగాని భక్తితో అలంకరించుట ఒక భక్తి సాధన. గోదాదేవి ఈ విధమగు భక్తి సాధనగా గావించినది. భగవదనుగ్రహమును పొందినది. దామోదర నామమును స్మరించుచు పూవుల దండను సమర్పించుట, అటుపైన పాదముల నుండి కృష్ణుని కన్నుల వరకు దృష్టి నిలిపి, చూచి నమస్కరించుట సముచితము. భగవదారాధన యాంత్రికము కారాదు. స్ఫూర్తితో శ్రద్ధాభక్తులతో నిరంతరము ఏ ఒక్క ఆరాధన చేసినను భగవత్కృపకు పాత్రులు కావచ్చును.

## 96. యజ్ఞభోక్తః

సృష్టి యజ్ఞమునకు శ్రీకృష్ణుడే భోక్త, అతడే భోజనము. భోక్త. అతనినుండే సృష్టిజీవులు వ్యక్త మగుదురు. అతని లోనికే సాగిపోవుదురు. విశ్వరూప సందర్శనమున శ్రీకృష్ణునే సర్వభోక్తగ అర్జనుడు దర్శించెను. సర్వవిషయములు తన నుండే పుట్టి పెరిగి, తనలోనికే చేరుట భగవద్ లీల. చీకటి, వెలుగు తన నుండే వ్యక్త మగును. జ్ఞానము, అజ్ఞానము తన నుండే వ్యక్త మగును. అసురులు, దేవతలు కూడ తన నుండే వ్యక్త మగుదురు. ద్వంద్వముగ సృష్టి నేర్పరచి, జీవులకు ధర్మాధర్మములు నేర్పి, అందరిని తనలోనికి అను గ్రహించుట కృష్ణుడు చూపు లీల. భక్తులెట్లు తనను చేరిరో అట్లే పూతనాది భూతములు, శిశుపాలాది రాక్షస ప్రవృత్తులు మరణ కాలమున తననే చేరిరి. సర్వులకు అతడే గతి, పతి.

## 97. దానవేంద్ర వినాశకః

దానవులలో శ్రేష్ఠులను దానవేంద్రు లందురు. హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు, రావణ, కుంభకర్ణులు, బలిచక్రవర్తి ఈ కోవలోనివారు. వీరందరు మహా తపస్సు గావించినవారు. బ్రహ్మ తేజస్సును కూడ పొందినవారు. వారి అహంకార ప్రజ్ఞను హరించి వారికి శాశ్వతమగు పుణ్యలోకములను ప్రసాదించిన శ్రీమహావిష్ణువే శ్రీకృష్ణుడు. దేవేంద్రుడైనను, దానవేంద్రుడైనను అహంకరించినచో దైవము కాలరూపమున వారి వారి అహంకారములను దహించును. అహంకారమే దానవత్వము. దైవము లేడనుకొనుట, తానే యున్నా డనుకొనుట అహంకారము.

## 98. నారాయణః

నారాయణ అను నాలుగు అక్షరముల నామము అతి పవిత్రము. ఈ నాలుగు అక్షరములు దైవము నాలుగు స్థితులకు సంబంధించినవి. పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరిగ వాక్కు నాలుగు స్థితులలో నున్నది. అట్లే దైవము నాలుగు స్థితులలో నుండును. అతనినే వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ తత్త్వములుగ చెప్పుదురు. సామ, ఋక్, యజుర్, అధర్వణ వేదములుగ దైవమే నిలచియున్నాడు. కృత, త్రేత, ద్వాపర, కలి నాలుగు యుగములుగ దైవమే యున్నాడు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర ప్రవృత్తులుగ దైవమే యున్నాడు. మనము వుండుట, ఎఱుక కలిగి యుండుట, ఆలోచన కలిగియుండుట, వాక్కు, చేత రూపముగ వ్యక్తమగుట అను నాలుగు స్థితులలో దైవమే యున్నాడు. ఇట్లు సృష్టి అంతయూ నాలుగు స్థితులలోనికి విప్పారుచు లయ మగునపుడు మొదటి స్థితి చేరును. అనగా

ఒకటి నుండి మూడు స్థితులు విచ్చుకొని మరల ఒకటియే యగును. ఈ నాలుగు స్థితులను సంకేతించు నాలుగు అక్షరముల నామము నారాయణ. దీనిని నిత్యము స్మరించు వారు నారదునివలె అనుగ్రహపాత్రులై సర్వలోకముల యందు దైవమును స్మరించుచు, తిరుగుచు నుండగలరు. హృదయమున నారాయణ నామము శ్వాసగ స్థిరపడినవారే నారదుడు, ప్రహ్లాదుడు, అంబరీషుడు, శుకుడు, రుద్రుడు. నామోచ్ఛారణలలో సర్వ శ్రేయస్కరమైనది నారాయణ నామము.

# 99. పరబ్రహ్మ

సృష్టికర్త యగు బ్రహ్మకు కూడ పరమైనవాడని అర్థము. బ్రహ్మ అనగా సృష్టికర్త. అతడు చతుర్ముఖుడు. బ్రహ్మము అనగా బ్రహ్మకు మూలము. అతనినే పరబ్రహ్మ మందురు. అట్టి పరబ్రహ్మమే శ్రీకృష్ణుడు. పరబ్రహ్మము నెవ్వరునూ తెలియజాలరు. అతడు అవ్యక్తుడు. నిర్వచనముల కందడు. తర్కమునకు లొంగడు. ఏ లక్షణము లేనివాడు. ఎవ్వరి చేతను తెలియబడని వాడు. తనకు తానే అయి వుండు వాడు. కాలము, ప్రకృతి, మాయ, శక్తికి మూలమైనవాడు. అతడు స్త్రీ కాదు, పురుషుడు కాదు. అతని కే నామము, రూపము లేదు. “అది” అని వేదములచే కీర్తింపబడువాడు. శ్రీకృష్ణుడు “అది”యే. ఇది ఋషుల అవగాహన.

## 100. పన్నగాశన వాహనః

పన్నగాశన మనగా పాములను ఆహారముగా భుజించు వాడు. అతడే గరుత్మంతుడు. అట్టి గరుత్మంతుని, వాహన ముగ గలవాడు శ్రీకృష్ణుడని అర్థము. మనలోని స్పందనమే గరుత్మంతుడు. స్పందనము నిర్వర్తించు శ్వాసయే అతని రెక్కలు. ప్రాణ స్పందనము గరుత్మంతుడు కాగ దాని నధిష్ఠించి యున్నవాడు దైవము. దైవప్రజ్ఞ వలననే ప్రాణ స్పందన జరుగుచున్నది. ప్రాణ మాధారముగనే జీవులు వర్తించుచున్నారు. గరుత్మంతుని మూపురముపై ఆసీనుడై యున్న చతుర్భుజుడగు శ్రీమహావిష్ణువును ఈ నామము ద్వారా కీర్తించుట సముచితము. అట్లు గావించినచో మన యందలి విషభావములగు సర్పములను గరుత్మంతుడు హరించి మనలను ఊర్ధ్వలోకములకు గొనిపోవును. శ్రీకృష్ణుడు ఊర్ధ్వలోకముల నుండి గరుడ వాహనుడై

దిగివచ్చి జీవుల నుద్ధరించు చుండును. గరుడునిపై ఆసీను డైన శ్రీకృష్ణుని ప్రాణాయామము ద్వారా సేవించుట యోగ విద్య సూచించు మార్గము.

## 101. జలక్రీడా సమాసక్త గోపీ వస్త్రాపహారకః

నీటి మడుగున సమావర్తులై క్రీడించుచున్న గోపికల వస్త్రములను హరించినవాడు శ్రీకృష్ణుడని అర్థము. గోప యువతులు శ్రీకృష్ణుడే తనుకు భర్త కావలెనని, కాత్యాయనీ దేవి నుద్దేశించి ఒక వ్రతమాచరించిరి. వ్రతాచరణ మందలి భాగముగ ప్రతిదినము యమునానది సరస్సునందు, ప్రాతః కాలమున ఉల్లాసముగ స్నానమాచరించు చుండిరి. వస్త్రములు తీరమున వదలి స్నానము చేసి మరల ధౌత వస్త్రములు ధరించుచుండిరి. ఆ వస్త్రముల నపహరించి, శ్రీకృష్ణుడు గోపకన్యలకు తత్త్వబోధన గావించి, అనుగ్రహించెను.

వస్త్రమనగా ఆవరణము. జీవునికి "తా నున్నాను" అను భావన యుండును. ఈ భావన యొక మాయ ఆవరణము. ఈ ఆవరణము తొలగనిదే దైవానుభూతి లేదు. ఈ

ఆవరణము ఎంత బలముగ నున్న, అంత అహంకార ముండును. నిజమునకు తన రూపమున నున్నది దైవమే. దైవము తానుగ నుండగ జీవుడు తానే యున్నాడనుకొను చుండును. సముద్రము లేని అల లేదు కదా! బంగారము లేని బంగారపు టుంగరము లేదు కదా! మట్టిలేని కుండ లేదుకదా! అట్లే దైవములేని తాను లేడు. తాను, నేను అని జీవుడు పలుకుట ఆవరణ రూపమగు వస్త్రము. ఈ వస్త్రము అపహరింపబడవలెను. అపుడు జీవుడు తన నిజ స్వరూప మును తెలియును. అట్లపహరింప కలిగినవాడు దైవమే. అనుగ్రహించుట అనుగ్రహమే గాని, చౌర్యము కాదు. తనను కోరిన వారియందు తానే నిలచుట కృష్ణుడు చూపు అనుగ్రహము. తన వద్దకు వచ్చు వారందరునూ నగ్నముగ రావలెననుట ఒక రహస్యార్థము. ఈ నగ్నత్వము అహంకార నగ్నత్వము కాని భౌతికము కాదు. శుక యోగీంద్రుడు కూడ నగ్నుడని తెలుపుటలో ఈ రహస్యమే ఇమిడి యున్నది.

తన్మయత్వము చెందుట వలన జీవులకు ఈ ఆవరణము తొలగును. భక్తి మాధుర్యమున, ఈ అహంకారపు ఆవరణ తొలగినపుడెల్ల దైవానుభూతి కలుగుచు నుండును. యోగులకు ధ్యానమున కలుగుచుండును. గోపికలకు ఈ అనుభూతి నందించినవాడు శ్రీకృష్ణుడు.

# 102. పుణ్యశ్లోకః

పుణ్యులచే కీర్తింపబడువాడు శ్రీకృష్ణుడు. కొంచెమైనను పుణ్యము చేయనివారు దైవమును కీర్తింపలేరు. పుణ్యాత్ముల చేతనే దైవము కీర్తింపబడును. కేవలము దైవమును కీర్తించుట చేత కూడ పుణ్యము కలుగును. పుణ్యము వలన కీర్తించుట, కీర్తించుట వలన పుణ్యము పొందుట ఒక దాని నొకటి బలపరచుకొనుచు, జీవులు మధుర మార్గమున శ్రీకృష్ణ చైతన్యమున స్థిరబడగలరు. కలి యుగమున స్మరణమే ముక్తిదాయకము. అదియే శరణ్యము. కృష్ణ స్మరణమున కంసాది రాక్షసులు సైతము ఉద్ధరింపబడిరి. కృష్ణ స్మరణము సర్వశుభంకరము

